# పరాజయం

Ravindranath M[illegible]

రవీంద్రనాథ మైత్ర

రచితం

[illegible]

'చక్రపాణి'

అనువాదం

యువ బుక్ డిపో

మద్రాసు :: తెనాలి

# ప రి చ య ము

రవీంద్రుని తండ్రి ప్రియనాథమైత్ర. తల్లి ఉమాదేవి. 1896 సంవత్స రాన రంగపురంలో రవీంద్రనాథమైత్ర జననం. రవివారంనాడు జన్మించడంవల్ల వీరిపేరు రవీంద్రనాథుడని పెట్టారు. రవీంద్రుడు చిన్నప్పటినుంచీ గొప్ప మేధావి. అక్షరాలు అన్నీ రాకముందే రామాయణం చేతబట్టి చదవటానికి మహా తంటాలు పడేవాడు. ఒత్తులు వచ్చినప్పుడు తల్లినడిగి ఉచ్చారణ తెలుసుకొనేవాడు. ఒక్కసారి తెలుసుకొన్నది యిక మరచిపోయేవాడు కాడు - అంత జ్ఞాపకశక్తి. ఆరోయేటనే ప్రాథమిక విద్య పూర్తిచేశాడు.

మిడిల్ స్కూలులో చదివేటప్పుడు రవీంద్రుని అన్న ప్రకాశచంద్రునికి మలేరియా వచ్చింది. చికిత్సకు కలకత్తా తీసుకొచ్చారు. తల్లితో పాటు రవీంద్రుడుకూడా కలకత్తా వచ్చాడు. కలకత్తా డాక్టరుల సలహా ప్రకారం గాలిమార్పుకు కుటుంబం అంతా దేవఘర్ వెళ్లింది. అక్కడ ఏడుమాసాలు వుండవలసివచ్చింది. రవీంద్రుడు దేవఘర్ హైస్కూలులో చేరాడు. స్కూలు కొత్త, కోర్సు కొత్త, సమయం స్వల్పం, అయినా క్లాసులోకల్లా ఫస్టున ప్యాసయ్యాడు. రవీంద్రునితండ్రికి మాష్టర్ను పెట్టి చదువు చెప్పించటం అంటే ఎప్పుడూ ఇష్టం వుండేదికాదు. తానే స్వయంగా, తన పిల్లలకేకాక పొరుగు పిల్లలకుకూడా, చెపుతుండేవాడు. తండ్రి గుణం కొడుక్కుకూడా అబ్బింది. అనేకమంది పిల్లలకు నిస్వార్థంగా చదువు చెప్పాడు.

దేవఘర్ ఛోటా నాగపూరులోని ఒక కొండప్రదేశం. అచ్చట ప్రకృతిదృశ్యాలు చాలా రమణీయంగా ఉంటవి. దేవఘర్‌కు చుట్టూ సంథాలు మొదలైన ఆదిమజాతులవారు నివసిస్తూవుంటారు. అచ్చటనే బాలరవీంద్రునికి ప్రకృతితో పరిచయం అయింది. ఆదిమజాతుల సంపర్కంకూడా లభించింది. తన కర్మజీవితంలో చాలాభాగం రవీంద్రుడు యీ ఆదిమజాతుల సేవకే వినియోగించాడు.

దేవఘర్‌నుంచి తిరిగి రవీంద్రుడు సయ్యద్‌పూర్ వచ్చాడు. ప్రకాశ చంద్రుడు యిక్కడే చనిపోయాడు. తర్వాత తండ్రి పెన్షన్ తీసుకుని ఫజల్‌పూర్ వెళ్లాడు, రవీంద్రుడు అక్కడ హైస్కూలులో చేరాడు. అప్పుడే వంగవిభజన జరిగింది. విభజనకు విరుద్ధంగా బెంగాలులో అంతటా ఆందోళన జరిగింది. బాలరవీంద్రుడుకూడా చుట్టుపట్ల గ్రామాలలో యితరవిద్యార్థులను వెంటబెట్టుకొని సభలుచేసి, ఉపన్యాసాలు యిచ్చి, రాష్ట్రీయ గీతాలు పాడి, తన కర్తవ్యం నెరవేర్చుకున్నాడు. అప్పటినుండే రవీంద్రుని హృదయంలో సాహిత్యప్రేమా సమాజసేవా బీజాలు నాటుకుపోయినవి.

తల్లి పేరుతో రవీంద్రుడు యువకులకోసం 'ఉషా గ్రంథశాల' అని ఒక గ్రంథాలయం స్థాపించాడు. ఎప్పుడూ పుస్తకాలు చదువుతూ వుండేవాడు. అతని స్కూలు జీవితంలోనే మేఘదూత, కుమారసంభవం, భగవద్గీత, రవీంద్రనాథ ఠాకూరుగారి అనేక గ్రంథాలు చదివి వాటిలో చాలా భాగం కంఠస్థపరిచాడు. సంస్కృతంలో మంచి జ్ఞానం వుండేది. ఒక పుస్తకం కూడా వ్రాశాడు. దీనికి ఇటాలియను ఫ్రెంచిభాషలలోకూడా ప్రవేశమున్నది.

ఫస్టుక్లాసులో మెట్రిక్యులేషన్ ప్యాసయి రవీంద్రుడు కలకత్తా వచ్చాడు. 1917 లో వంగవాసి కాలేజీనుంచి బి. ఏ. ఆనర్సు పాసయ్యాడు. పరీక్ష అయిన తరువాతనే హింవాలాదేవిని వివాహమాడాడు. 1918 లో తండ్రి అకస్మాత్తుగా చనిపోయాడు. మృత్యు సమయాన తండ్రిదగ్గర లేనన్న దుఃఖం రవీంద్రుని జీవిత మంతా బాధించింది. తర్వాత M. A., LL. B. చదవటానికి కలకత్తా యూనివర్సిటీలో జాయిను అయ్యాడు. ప్రిలిమినరీ పాసయాడు. ఫైనలు పూర్తి కాకముందే చదువుకు స్వస్తిచెప్పి అసహాయోగ ఆందోళనలో (1920) దూకాడు.

రవీంద్రుడు రంగపూరును కార్య క్షేత్రంగా పెట్టుకుని అనేక సంవత్సరాలు పనిచేశాడు. అప్పటికి రంగపూరుతో సంబంధం వదలి పది పన్నెండు సంవత్సరాలు అయింది. కాలేజీ నుంచి అప్పుడే వచ్చిన అనుభవంలేని యువకుడు. పెద్దలలో పేరులేదు. జేబులో డబ్బులేదు.

అయినా రవీంద్రుని సేవ, విశ్వాసము, యువకులను వశపరచుకుంది. కొన్నాళ్ళ తరువాత లోకల్ పొలిటిక్స్‌లో కూడా పాల్గొన్నాడు. చాలా కాలం రంగపూరు మునిసిపల్ కౌన్సిలరుగా ఉన్నాడు.

రవీంద్రుడు విసుగూ విరామం ఎరగడు. కాంగ్రెసు ప్రచారం, విద్యార్థులకు విద్యా వసతులు, సంఘ అత్యాచారానికి బలిఅయిన స్త్రీలకు తోడ్పాటు, ఆదిమ జాతుల ఉన్నతికి ప్లానులు వేయటం, వారిలో సంఘీభావం కలుగ జేయటం, హిందీ ప్రచారం, ఎప్పుడు చూచినా యీపనుల లోనే మగ్నుడై ఉండేవాడు. చాలా కొద్దికాలం సాహిత్య సేవకు వినియోగించాడు. అయినా వీరి రచన చూస్తే యింత ఎప్పుడు వ్రాయ గలిగాడా అని ఆశ్చర్యం కలుగుతుంది.

రవీంద్రుని కర్మజీవితమంతా ఒక ఉపాసనవలె గడిచింది. అతడు స్థావరంగా ఎక్కడా వుండలేదు. రంగపూరులో కొన్నాళ్లు పనిచేసిన తరువాత ఆదిమ జాతుల సమస్య తలపెట్టాడు. రంగపూరునుంచి కార్యక్షేత్రం సంతాల్ పరగణాకు మార్చాడు. అక్కడ సంతాల్, ఓరావ్ జాతులకు చాలా సేవ చేశాడు. వీరిలో చాలామంది మిషనరీలవల్ల క్రైస్తవులయ్యారు. రవీంద్రుడు వీరిలో చాలామందిని మరల హిందూ మతంలోకి మార్చాడు. వాళ్ళభాష 'కృఖ్' నేర్చుకున్నాడు. ఆ భాషలో మతగ్రంథంకూడా ఒకటి వ్రాయాలనుకున్నాడు. కాని వీరి కోరికను మృత్యువు నెరవేరనీయలేదు.

కలకత్తాలో విద్యార్థిగా వుంటున్నప్పుడు సుప్రసిద్ధ వంగనాటకకారుడు, స్వర్గీయ ద్విజేంద్రలాల్ రాయిగారితో వీరికి పరిచయం కలిగింది. రాయిగారు వీరి ప్రతిభ చూచి వీరిని చాలా ప్రోత్సహించారు. ఆ రోజులలో వీరు రచించిన హామిల్, మొదలగు నాటకాలలో రాయిగారి ప్రభావం స్పష్టంగా కన్పిస్తూవుంది.

రంగపూరులో వుండేటప్పుడే వీరు 'ఆనందబజారు' 'శనివారేరచిట్టీ' మొదలగు పత్రికలలో వ్రాస్తూవుండేవారు. రంగపూరు మునిసిపల్, డిస్ట్రిక్టుబోర్డు ఎన్నికలప్పుడు రంగపూరునుంచి 'వార్త' అనే పత్రికను కూడా ఒకదాన్ని నడిపారు.

రవీంద్రుని ప్రతిభ సర్వతోముఖమైనది. నవలలు, నాటకాలు, కవిత్వము, కథలు, వ్యంగ్యము, హాస్యము అన్నీ వ్రాశాడు; సాఫల్యం పొందాడు. వీరు వ్రాసిన నాటకాలన్నీ స్టేజీకి పనికివచ్చేవే. 'మానమయీ గరల్ స్కూల్' అనే నాటకము టాకీగా కూడా తీశారు. కలకత్తాలో ఈ ఫిల్ము వరుసగా 22 వారములు నడిచింది.

రవీంద్రుని రచనలో ఏదో ఒక విధమైన ఓజస్సు మనకు కనిపిస్తుంది. సాహిత్యసృష్టికి అవసరమైనవన్నీ వీరికి లభించినవి. ప్రకృతి పరిచయం, సాధారణ జనసంపర్కం, పల్లెటూళ్ళ అనుభవం బాగా కలిగింది. ఆదిమ జాతులతో వుంటంవల్ల ఆదిమ మానవుని — నాగరికతాడంబరము ఎరుగని మానవుని — బాగా స్టడీచేయటానికి అవకాశం దొరికింది. నాగరికతా దృష్టితో చూస్తే ఆదిమ జాతులు ఇతర జాతులకంటే చాలా వెనుకపడి వుండవచ్చును. కాని మానవుడు-ప్రకృతి, సంబంధాన్ని గురించి చర్చించేవరకు ప్రపంచంలోని అన్నిజాతులకంటే ఆదిమ జాతులే అగ్రస్థానం వహిస్తవి.

రవీంద్రుడు తన పాత్రలతో లీనమైపోతాడు. పాత్రలను సృష్టించేటప్పుడు తనవ్యక్తిత్వాన్ని వాటిలో ఐక్యం చేస్తాడు. తన కథలు మిత్రులకు చదివి వినిపించేటప్పుడు పాత్రల కష్టాలకు కళ్ళవెంట నీళ్లు కార్చేవాడట. పాత్రలతో కోరుకున్న యీ ఐక్యతే పాత్రల వ్యక్తిత్వానికి ప్రాణం పోస్తున్నది.

ఏసాహిత్యంలోనైనాకానీ. హాస్యరచనలలోని పాత్రలు చాలా కాల్పనికంగా వుంటవి-స్వాభావికత్వం వుండదు. రవీంద్రుని పాత్రలలో యీ దోషము బొత్తుగా లేదనటానికి వీలులేదు కాని చాలాభాగం సహజంగానే వుంటవి. అప్పటప్పట పాత్రల చిత్రణ మనలనుండే చేశాడా అన్నట్లు వుంటుంది. ఇదే రవీంద్రుని కళాసాఫల్యానికి ప్రమాణము.



# పరాజయం

గదికోసం తిరిగి తిరిగి విసిగి వేసారి ఆఖరికి వినయుడొక సాహసకార్యం చేసి కూర్చున్నాడు—అంటే గోకుల మిత్రగల్లీలో 13 నెంబరు ఇంటి మూడో అంతస్తు అద్దెకు తీసుకున్నాడు. ఇంటావిడ విధవ, తన ఏకైక పుత్రిక వాసంతితోపాటు రెండో అంతస్తులో కాపురముంటున్నది. కింద అంతస్తులో చిన్న చిన్న కుటుంబీకులు ఉంటున్నారు. ఆ అద్దెమీదవచ్చే ఆదాయంతో ఆ విధవావిడ దినాలు హాయిగా గడచిపోతున్నై.

మూడో అంతస్తుకూ మిగతాయింటికీ ఏమీ సంబంధంలేదు. కొయ్యమెట్లు పైనించి తిన్నగావచ్చి కిందఅంతస్తు దగ్గర కలిసిపోతున్నై. అందుచేతనే మూడోఅంతస్తు ఒక అపరిచిత యువకుడికి అద్దెకివ్వటానికి ఆ ముసలావి డేమీ సందేహించలేదు. వాసంతి మొదట కొంచెం నసిగింది—కాని తల్లికి అడ్డురావటం, ఆమెకు మొదటినుంచీ అలవాటులేదు. అందుకనే ఈ విషయంలో ఆమె ఏమీ ఆగం చెయ్యలేదు. కాని ఒకమాటు మాత్రం— "మీ అద్దెతనితో చెప్పు, స్నేహితులందర్నీ పిలుచుకొచ్చి రాత్రింబగళ్ళూ అల్లరి చెయ్యొద్దని" అని అనిచూసింది.

"నీదంతా చిత్రమే! మర్యాదస్తుల అబ్బాయి—" అన్నది తల్లి.

"ఇలాంటి మర్యాదస్తుల్ని చాలామందిని చూశాను. ఆ ఎనిమిదో నెంబరు మెస్‌దగ్గరకిపో—స్కూలుకు పోతుంటే అందులో వాళ్ళంతా నోరు తెరుచుకుని ఎట్లా చూస్తారో!— కొంతమంది ఈలలుకూడా వేస్తారు!"

ఈ ప్రత్యక్ష ప్రమాణానికి తల్లి సమాధాన మేమిచెప్పగలదు?

వాసంతికి పద్దెనుగో ఏడు. చక్కనిదని పొరుగు స్త్రీలలో ఖ్యాతికూడా ఉంది. బెంగాలీకుటుంబాల్లో ఇంత పెద్ద పిల్లకి పెళ్ళికాకుండా ఉండటం ఆశ్చర్యకరమైన విషయమే! దీనికి కారణాలు: ఒకటి, ఆ విధవానికి చుట్టపక్కా లెక్కువమంది లేకపోవటంచేత పిల్ల పెద్దవుతున్నదని రాత్రింబగళ్ళు జ్ఞాపకం చేసేవాళ్ళుకూడా లేకపోయారు; రెండోది, ఆమె భర్త

సంస్కారి. బాల్యవివాహాలకి అతను పూర్తిగా వ్యతిరేకి! ఆమె తను చదువుకోపోయినప్పటికీ చదువుకున్న భర్త అభిప్రాయమే తుచ తప్పకుండా నిజమని నమ్మింది. మాటల ధోరణిలో ఎవరన్నా కూతురువివాహంసంగతి తెస్తే "వారు పదిహేడో ఏటిదాకా వివాహం చెయ్యవద్దన్నారు. నన్న వారిమాట ఎలా తోసివెయ్య మంటావు? అనేది. అందుచేతనే వాసంతి వివాహంసంగతి ఆమె ఎదుట ఎవ్వరూ తెచ్చేవారు కారు—ఆమెకూ సంబాధ తగ్గేది. వాసంతి ఇప్పుడు స్కూల్లో చదువుతోంది. తల్లి యింటిపనులు చూస్తూఉండేది. సాయంత్రం వాసంతి స్కూలునుంచి రాగానే ఇద్దరూ కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడుకునేవారు. ఇవీ వాళ్ళ నిత్యకృత్యాలు.

* * * *

సాయంత్రం వినయుడు కాలేజీనుంచి తిరిగివచ్చేవరకు సోమూ డాబా మీద చిత్తుగాపండుకుని ఉన్నాడు. సోమూ అతని నౌకరు. నౌకరంటే సరిగ్గా వాడిని గౌరవించినట్టు కాదేమో; అనుచరుడు! వాడు చిన్నతనం నించి ఆటపాటల్లో సుఖ దుఃఖాల్లో వినయుడికి సహచరుడు. వినయుని తండ్రి ఒరిస్సా వెళ్ళినప్పుడు సోమూ దొరికాడు. దిక్కులేనివాడనే ఉద్రేకంతో ఆయన వాణ్ణి వెంట తీసుకొచ్చాడు. అప్పటినించీ వాడు ఆయన ఆశ్రయంలోనే పెరిగాడు. కాని వినయుణ్ణి వదిలి ఒక్కనిముషం ఉండేవాడుకాడు. అందుకనే వినయుడు కలకత్తా వచ్చేటప్పుడు గత్యంతరంలేక సోమూను వెంటబెట్టుకు రాకలసివచ్చింది. వినయుడి తల్లికూడా సోమూను కొడుకువెంట పంపి నిశ్చింతురాలైంది.

సోమూ కళ్ళుమూసుకు వెల్లకిలా పండుకోటంచూసి వినయుడు—"ఏమొచ్చిందోయ్ నీకు?" అని అడిగాడు.

"ఏముంది రావటానికి! ఈ రాత్రికి తిండి ఎల్లాగా అని ఆలోచిస్తున్నా!"

"ఇదేగదా!—ఇక్కడ హోటల్లేమూ?"

"ఎందుకుండదూ? అక్కడ గాడీవాలాలే తింటూఉంటారు."

"నువ్వుపోయి చూడవోయి, మంచిహోటలు తప్పకుండా ఉంటుంది. కాలేజీకి దగ్గర్లో హోటల్లేకపోతే జరుగుతుందా?"

"ఎందుకు జరుగదూ? అంతా నీ మాదిరి కళ్లుమూసుకుని ఇళ్ళదైకి తీసుకోరు. వాళ్ళకి తెలివితేటలున్నై. ఇక కాలేజీ దగ్గరంటావా? ఎందుకు దగ్గ కాదూ. మూడు మైళ్లుంటే!"

"ఐతే ఇక ఉపాయం?"

"ఒక్కటే ఉంది, నూనెపూరీలు మింగటం!"

"అది నా వల్ల కాదు, సోమూ! నువ్వింకో పనిచెయ్యి. కిందికిపోయి ఒక మాటు ఇంటావిణ్ణి పిల్చుకురా."

రెండుమూడు నిమిషాల్లో సోమూ బాలీసుకుటుకుంటున్న వాసంతితల్లి దగ్గరకొచ్చి నిలబడ్డాడు. వాసంతి కిటికీ దగ్గరగా కుర్చీలో కూర్చుని హిస్టరీ చదువుకుంటోంది. సోమూను చూడగానే — "ఏం కావాలి?" అని అడిగింది.

"బాబయ్యగారు—ఇంటావిణ్ణి పిలుచుకురమ్మన్నారు—"

"ఇంటావిడా! ఇక్కడ యింటావిడ గింటావిడ ఎవ్వరూలేరు. ఇది మర్యాదస్తుల యిల్లు—" అని ఇంకేమేమో అనబోతూవుండగా తల్లి అడ్డువచ్చి అన్నది— "ఆయన కేం కావాలి?"

వాసంతిముఖం చూసి సోమూ భయపడి—"నాకు తెలియదు" అన్నాడు.

"ఏం కావాలో అడిగిరా" అన్నది వాసంతి తల్లి.

వాసంతి కుర్చీలోనించి లేచి "వద్దమ్మా నేనే అతని దగ్గరికి పోతున్నాను! మర్యాదస్తుల్ని ఎలా పిలవాలో నేనుపోయి నేర్పివస్తాను." అని తల్లి అనుమతికూడా ఎదురు చూడకుండా తుపానులాగా ఇంట్లోనించి వెళ్ళిపోయింది.

తిరిగి తిరిగి అలిసివచ్చిన వినయుడు మేడమీద ఈజీ చైరులో పండుకుని ఇంటావిడకోసం ఎదురు చూస్తున్నాడు. హఠాత్తుగా అతనికి ధన ధన కాళ్ళచప్పుడు వినపడింది—తలెత్తి చూశాడు. నడికారు ఇంటావిడకి బదులు చక్కని కిశోరి ఎదట నిలుచుని ఉంది. ఆమె వెనకనే సగం వచ్చి సోమూ! వినయం ఉంటుబట్టక "ఎవరికోసం వచ్చారు?" అని అడిగాడు వినయుడు.

"మీకోసమే!" అన్నది వాసంతి కటుస్వరంతో.

"ఎందుకూ?"

"మీరు పిలిచిం దెవర్ని?"

"ఇంటావిణ్ణి!"

"ఇంటావిడకి బదులు నే నొచ్చాను. అపరిచితుల ఎదటకొచ్చే అలవాటూ మెకి లేదు. అదీకాక ఇళ్ళద్దెకివ్వటం మావృత్తి కాదు. ఇంతఇల్లు మాకవసరం లేదు కనకనే ఎవరికన్నా ఇస్తూ ఉంటాము."

"నేను పొరబడ్డాను, క్షమించండి. మాకు తిండీ తిప్పలూ సరిగ్గా—"

"దానికి మేము బాధ్యులం కాము! మీరేమనుకున్నారో యిది హోటలు కాదు—" అని వాసంతి తక్కున ఆగిపోయి వినయుడి ముఖంవేపు చూసింది. ప్రశాంతంగా ఉన్న రెండుకళ్లు రెప్పవాల్చకుండా ఆమెవంకనే చూస్తున్నై. వాటిలో కోపంగానీ, విరక్తిగానీ ఏమీ గోచరించలేదు.

"ఐతే మమ్మల్ని ఏం చెయ్యమంటారు?" అన్నాడు వినయుడు మెల్లగా. ఈ ప్రశ్నలో ఎంత నిర్భరత్వ ముందో వాసంతి మామూలు స్థితిలో ఉన్నట్టయితే తెలుసుకునేది. కాని, అకారణ క్రోధంవల్ల ఆమె మనస్సు విషాక్తమయింది. ఆమె కటుస్వరంతో — "మీ యిష్టమొచ్చింది చేసుకోండి ఊరక 'ఇంటావిడ' 'ఇంటావిడ' అని మా అమ్మని అవమానించకండి—" అని గబగబ మెట్లు దిగిపోయింది.

ఇక ఈమె ఎవరో గ్రహించటం వినయుడి కంత కష్ట మనిపించలేదు. కాని ఈమె కోపానికి కారణ మేమిటో తెలియక పోవటంవల్ల వినయుడికి కుతూహలం మాత్రం కలిగింది. వాసంతి వెళ్ళిపోగానే "సోమూ! చూశావటోయ్ లక్షణాలు!" అన్నాడు.

"అష్టమ్మో! ఇప్పుడే యిలావుంది. కొన్నాళ్లు పోతే వామి తల్లిని దూరంగా ఉండమనదూ?" అన్నాడు సోమూ. వామి తల్లిది వినయుడి ఊరే! ఆమెనోటికి ఆ వూళ్లో అంతా వెరుస్తారు. సోమూకు ఆ మనిషంటే తగని భయం!

ఆపదలోకూడా మతి చలించని వ్యక్తులు కొందరుంటారు. వినయుడు

ఆ రకంవాడే. వాసంతి కటువాక్యాలకు అతను మొదట కొంత నిరుత్సాహ పడ్డా, వెంటనే అతను తనమార్గం స్థిరపరుచుకున్నాడు. మర్నాడు యజమానీ, నౌకరూ కూర్చుని ఆలోచించుకుని, ఒక స్టౌ, వంటసామగ్రి, పాత్రలూ అవీ కొని తెచ్చారు. విజయుడు స్టౌ వెలిగించాడు. సోమూ ఉత్సాహంతో వంట ప్రారంభించాడు. తయారైన వంట కాలు మహా అద్భుతంగా ఉన్నాయి. కూరలో ఉప్పు వెయ్యటం మర్చిపోయాడు. పులుసు ఇంగువవాసన వస్తోంది. అన్నం సగం బియ్యం, సగం సంకటి!—ఈ చిత్రమైన వ్యంజనాలనే ఇద్దరూ కళ్లుమూసుకు మింగారు.

"చూడు సోమూ! మనకి బాగా వంటచెయ్యటం తెలియదు. రేపు పాక శాస్త్ర మొకటి కొనుక్కొస్తాను" అన్నాడు వినయుడు భోంచేసినాక.

"ఏమిటది?"

"ఒక పుస్తకం. వం టెలా చెయ్యాలో అందులో రాసి ఉంటుంది."

"ఓ, ఇంకేం, తీసుకురండి, మీరు చదివిచెప్పితే నేను వండేస్తాను."

నిర్ణయానికి వచ్చినాక పని మొదలుపెట్టటాని కేమి ఆలస్యమవుతుంది? సాయంత్రం కాలేజీనించి తిరిగి వచ్చేటప్పుడు వినయుడు పాకశాస్త్ర మొకటి కొని తెచ్చాడు. ఆ రాత్రే పుస్తకంలో చెప్పినప్రకారం వంట మొదలు పెట్టారు!—తింటానికి కూర్చుంటే ఉదయంకంటే అధ్వాన్నంగా ఉంది. ఒకటీ నోట పెట్టటానికి పనికిరాలేదు.

"పెద్ద పొరబాటు పడ్డామోయ్ సోమూ! త్రాసు కొనటం మర్చి పోయాను. మసాలా సరిగ్గా తూచి వెయ్యకపోవటంమూలానే యిలా అయిం దనుకుంటాను. ఏమంటావ్?" అన్నాడు.

తనచేతగానితనం అంతా త్రాసుమీద పడటంచూసి సోమూకి ధైర్యం వచ్చింది.—"నిజమే! మసాలాతూచివేస్తే వంట కాలింకా బాగా ఉండొచ్చు," అన్నాడు సోమూ.

* * *

ఆనాటి సాయంకాలం వినయుడితో చిత్రంగా పరిచయం అయినప్పటినించీ వాసంతి ఒక్కవిషయాన్ని గురించే ఆలోచిస్తున్నది—ఇన్ని కటువాక్యాలు

నోరు మెదపకుండా ఒక పురుషుడెలా సహించాడు, అని! వాసంతి ప్రత్యుత్తరాన్ని ఆశించే వినయుడిదగ్గరికి పోయింది. ఒక కాలేజీవిద్యార్థి తాననే మాటలన్నీ పడతాడనీ, ఒక్క మాటకూడా జవాబు చెప్పడనీ ఆమె ఊహించనైనా లేదు. వాసంతి అక్కడనించి వచ్చినప్పటినించీ ఈ సంగతే అనుకొంటోంది. ఆమె తన మనస్సులో తన ఇంట్లో అద్దెకున్న వాళ్లస్వభావాన్ని ఒకవిధంగా చిత్రించుకుంది. కాని వినయుణ్ణి చూశాక ఆ కల్పనకీ ఈ వాస్తవానికీ ఏమీ సాదృశ్యం లేకపోయింది. రాత్రి మాటల సందర్భంలో వాసంతి వినయుడి భోజనంసంగతి తల్లిదగ్గర తెచ్చింది. తల్లి — "పాపం! మన యింట్లో ఉంటున్నప్పుడు మంచీ చెడ్డా మనం చూడొద్దూ? సహాయం చేసే దేమీలేక పోయినా సలహా అన్నా ఇవ్వాలిగా. పైగా ఆ అబ్బాయి అల్లరిచిల్లరివాడిగా కనిపించటం లేదు. మనతో చాల్ల మర్యాదగా ప్రవర్తిస్తున్నాడు. అలాంటివాడి యోగక్షేమాలు విచారించకపోవటం మనది అన్యాయం కాదా!" అన్నది.

తల్లిమాటలో సత్యాన్ని వాసంతి కాదనలేకపోయింది. అందుకనే ఇవ్వాళ ఉదయం ఆమె అద్దెవాళ్ళ యోగక్షేమాలు కనుక్కోవాలని బయలుదేరుతూ ఉండగా వాళ్ళ మెట్లమీదకే సోమూ ఎదురువచ్చాడు. ఇది అద్దెవాళ్లు వచ్చేపోయే దోవకాదు. సోమూ ఎక్కడికి పోతున్నాడో తెలుసుకోవాలనే కుతూహలం కలిగి వాసంతి — "ఎక్కడి కిటు?" అని అడిగింది.

మొదటి పరిచయంనించే సోమూకు వాసంతి అంటే భయం! ఆనాటి సంగతి వాడింకా మర్చిపోలేదు. గాభరాపడి "అమ్మగారిదగ్గరికి" అన్నాడు.

వాసంతి సోమూముఖం తేరిపారచూచి "రా, నావెంట" అంది.

వంట ప్రయత్నాలు చేస్తున్న తల్లిదగ్గరికి వాసంతి సోమూను వెంటబెట్టుకొచ్చింది. "మీకు భోజనాలు సరిగ్గా అముగుతున్నాయా?" అని అడిగింది వాసంతితల్లి.

"ఉహుఁ, అందుకనే మీ దగ్గరకొచ్చా" నన్నాడు సోమూ.

"ఏమిటా ఇబ్బందులు?"

"ఏమీ లేవు. వండినపదార్థాలే బాగుండటం లేదు. అందుకని త్రాసుకోసం వచ్చాను." త్రాసుకూ వంటకూ సంబంధమేమిటో తల్లీకూతుళ్లకర్థం కాలేదు. ఇద్దరూ సోమూ ముఖంవంక చూడసాగారు.

"బాబయ్యగారు పుస్తకమొకటి కొనుక్కొచ్చారు. నేనా పుస్తకం చూసే వంట చేస్తున్నాను. మసాలా తూనికప్రకారం వెయ్యకపోవడంవల్ల వంట బాగా ఉండ్డంలేదని బాబయ్యగారి నమ్మకం. అందుకనే ఉదయం వారు త్రాసు తేవటానికి బజారుకు పోయారు. వారొచ్చేవరకు ఆలస్యమవుతుందేమో, అలా అయితే కాలేజీకి వేళ మించిపోతుందని మీ త్రాసుకోసం వచ్చాను. ఇస్తే—" వాసంతి చాలా కష్టంమీద యింతవరకూ పెదాలు బిగబట్టుకుంది. కాని ఇక ఆగలేక పకపకా నవ్వింది. తల్లి కూతురు 'పకపక' నవ్వు వినిపించుకోకుండా ప్రేమ ఉట్టిపడే స్వరంతో—"త్రాసుతో తూచి వండితే వంటకాలు బాగుంటాయా? వంట నేర్చుకోవాలి. మీలో ఎవరికీ వంట చేత కాదనుకుంటాను" అన్నది.

వాసంతి నవ్వుచూసి సోమూ సగం చచ్చాడు. కాని తల్లి ప్రేమని చూసేవరకి అతనికి కొంచెం ధైర్యం వచ్చింది: "నాకు చాతవుగాని బాబయ్యకి చాతకాదు" అన్నాడు. వాసంతి మళ్ళీ నవ్వింది. వంట చేసేందుకు త్రాసునుపయోగించే వాళ్ళ పాకవిద్యా ప్రావీణ్యత ఎంతవరకుంటుందో ఆమె అర్థం చేసుకుంది. ఐనా అతని పాకవిద్యాభిమానం చూసి ఆమె నవ్వునాపుకోలేకపోయింది. వెలవెల పోతున్న సోమూ ముఖంవంక చూసి వాసంతి తల్లి—"ఇదుగో, మీకేమీ ఆక్షేపణ లేకపోతే ఒకరోజున వచ్చి మీకు వంటచెయ్యటం నేర్పిపోతాను" అన్నది.

సోమూ మహా ఉత్సాహంతో అన్నాడు: "అలాగే చెయ్యండి అమ్మగారూ! బతికిపోతాం. బాబయ్యగారూ—"

వాసంతి హఠాత్తుగా మధ్యనే అడ్డి—"వద్దమ్మా! మన కెందుకా యాతన! నేను త్రాసు తెచ్చి యిస్తాను" అని లోపలికి వెళ్ళింది. ఈ అపరిచితులతో సంబంధం పెట్టుకోవాలనే కోర్కె వాసంతికి బొత్తిగాలేదు. అదికాక అయాచితంగా తల్లిపోయి ఒకరికి వండి పెట్టటం ఆమె కసలిష్టం

లేదు. వినయుడొచ్చి అడిగితే అదో విధం—కాని నౌకరుమాట విని—ఛీ!

ఒకవైపున మిథ్య ఆత్మాభిమానం. రెండో వైపున వాత్సల్యం, స్నేహం. వీటి రెంటికీ యుద్ధమారంభమైంది. కొన్నాళ్ళదాకా వాసంతి స్కూలుకు సెలవులు. మధ్యాహ్నం ఏమీ తోచక తల్లి గుడ్డలు కుట్టుతూ ఉంటే వాసంతి అక్కడికి పోయి కూర్చుంది—"ఏమే సంతీ! వాళ్లకి వండిపెడితే నీదేం పోయిందే?" అని అడిగింది తల్లి.

"పోయే దేముంది? అసలు నువ్వు వాళ్ళకి వండిపెట్టటానికి ఎందుకు పోవాలో చెప్పు? వాళ్లు నీ దగ్గర కొచ్చి ఏమన్నా బతిమాలారా?"

"మర్యాదస్థుల అబ్బాయి నీ దగ్గరకొచ్చి నోరుతెరచి అడుగుతాడా? వాళ్ళ నౌకరడిగిందే ఘనం! పాపం, వాళ్ళు భోజనాని కెంత యిబ్బంది పడుతున్నారో ఆలోచించు. త్రాసుతో తూచి వంటచేస్తే పదార్థాలు నోట్లో పెట్టుకోటానికి పనికివస్తాయా?" అని తల్లి నిట్టూర్చింది.

వాసంతి మాట్లాడలేదు. త్రాసు తలుపుకు వచ్చినప్పుడెల్లా ఆమెకి నవ్వాగేది కాదు. కాని ఈసారిమాత్రం నవ్వలేకపోయింది. జుట్టుముడి సద్దుకుంటూ ఇంకో గదిలోకి వెళ్ళిపోయింది.

మధ్యాహ్నం పన్నెండుగంటలకు వినయుడు బజారునించి వచ్చాడు. కాని త్రాసు తేలేదు. టెరియరు కుక్కపిల్లను తెచ్చాడు. తెల్లగాముద్దుగా ఉంది పిల్ల. ఉంగరాలు తిరిగిన బొచ్చు; నల్లటి కళ్లూ. వినయుడు బజారుకెళ్తూ దోవలో కనిపిస్తే యాభైరూపాయలుపెట్టి కొనుక్కొచ్చాడు. కుక్కలంటే అతనికి చాలాప్రేమ—వాళ్ళింటిదగ్గరకూడా గుంపెడు కుక్కలున్నై. కుక్కపిల్లని చూసి సోమూ చాల సంతోషించాడు—దాన్ని ఎత్తుకున్నాడు. ముద్దులాడాడు.

"త్రాసెక్కడ దొరికిందోయ్" అన్నాడు వినయుడు త్రాసుమాసి.

"అమ్మాయిగా రిచ్చారు" అన్నాడు సోమూ.

అమ్మాయి ఎవరో వినయుడికర్థం కాలేదు. "ఎవరి సంగతోయ్ నువ్వు చెప్పేది?" అన్నాడు.

"అప్పుడే మర్చిపొయ్యారూ? ఆవాళొచ్చి మిమ్మల్ని దబాయించి

పోలా?"

"ఓ! ఆవిడా! అక్కడి కెందుకు పోయావ్? ఆ అమ్మాయికి మనల్ని చూస్తే కళ్ళల్లో కారం పెట్టుకున్నట్టు ఉంటుంది. మనమేం పాపంపోశామో ఆమెకి!"

ఈ మాట లనవలసిన అవసరంలేదు వినయుడికి. ఏదో ఆవేశంలో నోరు జారాడు. కాని ఈ మాటలు ఇంకో హృదయంలో ఎంత విప్లవం లేపినవో వినయుడికి తెలిసే మార్గంలేదు. వాసంతి తల్లిమాటలు విని పశ్చాత్తాపపడి, అభిప్రాయం మార్చుకుని అడ్డకొచ్చినవాళ్లకు భోజన సౌకర్యా లెలా ఉన్నాయో చూద్దామని పైకి వస్తూవుండగా పై మాటలు ఆమె చెవిని పడ్డయ్. తన్నుగురించి వాళ్ళలో అభిప్రాయ పడతారని ఆమె కలలోనైనా అనుకో లేదు. ఆశ్చర్యంతో వెనక్కు తిరిగింది!

కళ్ళల్లో కారం పెట్టుకున్నట్టు ఉంటుందట!—ఈ మాట ఆమె మర్చి పోలేకుండా ఉంది. ఎందుకిలా ఉండటం? తనేం దుర్మార్గంగా ప్రవర్తించింది? ఆవాళసంగతా? అందులో తన తప్పేముంది? తను అబద్ధమేమన్నా అన్నదా?—సరే, కానీ! అత నలా అనుకుంటే నుకీమంచిది! ఇవ్వాళనించీ అతన్ని చూస్తే నిజంగా కళ్ళల్లో కారంపెట్టుకున్నట్టే ఉంటుంది తనకు! అత నెలా భావించుకుంటే తనకేం లెఖ్ఖ!

ఆనాటిసాయంత్రం, ముఖ్యంగా వినయుణ్ణి హీనపర్చాలనే ఉద్దేశంతోటే, వాసంతి మిద్దెమీదికి పచార్లు చెయ్యటానికి పోయింది.

అద్దెవాళ్ళొచ్చాక యింతవరకామె పైకి పోలేదు. ఆమె అదే దృఢ సంకల్పంతో పిట్టగోడ పట్టుకుని నిలబడ్డది. గదితలుపు తెరిచిఉంది. వినయుడు పక్కమీద పడుకుని సితార్ వాయిస్తున్నాడు. ప్రపంచంలోని తదితర వాద్యయంత్రాలన్నీ నిర్లక్ష్యంచేసి అత నీ యంత్రాన్నే సాధన చేశాడు. వాయిద్యం కమ్మగాఉంది. వాసంతి దిగిపోవాలనుకుంది, కాని భైరవిరాగం ఆమె కాళ్ళని కట్టివేసింది, ఐనా ఆమె తన బలహీనతను బైట పడనిస్తుందా! వాద్యం విననట్టు రోడ్డుమీదకు వంగి చూస్తోంది! ఎంతసేపని అలా చూడగలు?......హఠాత్తుగా ఆమె పాదాలకేదో మెత్తటిస్పర్శ

తగిలింది. తిరిగి చూసింది. కుక్కపిల్ల! ఆమె కాలు నాకుతోంది. వాసంతి తనకు తెలియకుండానే ఆ పిల్లను ఎత్తుకుంది. ముద్దాడింది, హృదయానికి కరిపించుకుంది! ఎంత చక్కని పిల్ల! మాంచి కళ్లు, చిన్ని మొహం, తెల్లటి పళ్లు!... ఎవరిదో కాళ్ళ చప్పుడు. తలెత్తి చూసింది. రెండు మూడు గజాల దూరంలో వినయుడు! వాసంతి మొహం సిగ్గుతోనూ కోపంతోనూ ఎర్రబడింది. తను ఇక్కడికెందుకు వచ్చింది? వినయుణ్ణి హీనపర్చటానికి! చేసిందేమిటి? అతని కుక్కపిల్లని ముద్దాడింది! వినయుడి దృష్టిలో తనిప్పుడేమయింది?—ఛీ! ఈ అనర్థాని కంతా మూలం ఈ కుక్కపిల్లే! దీనిమూలానే తనకు తలవంపు లొచ్చినై!—వాసంతి తన కోపమంతా కుక్కపిల్లమీద చూపింది—చేతులోదాన్ని జారవిడిచింది! అభిమానంతో కిందికి నడిచింది! వినయుడు 'కుయ్యో' మంటున్న కుక్కపిల్లవంక చూడలేదు. వాసంతివంకనే చూస్తున్నాడు. ఆమె దిగిపోయాక కుక్కపిల్లని తీసుకుని గదిలోకి వచ్చాడు.

* * *

వినయుడు మాంచి సమస్యలో పడ్డాడు. ఇవ్వాళ కాలేజీకి నాగా పెట్టి కుర్చీలో పడుకొని ఆలోచనలో పడ్డాడు. సోమూ చాపమీద పండుకొని గుర్రు పెడుతున్నాడు. జో (కుక్క) ఇంట్లో లేదు. నిశ్శబ్దంగా ఉంది మధ్యాహ్నం. దూరాన కనిపిస్తున్న మేడలు మూర్తీభవించిన గాంభీర్యమా అన్నట్టున్నాయి. ఆకాశపు ఒడిలో ఫాల్గుణమాసపు మేఘఖండాలు తెల్లని పిల్లలమాదిరి పరుగులెత్తుతున్నాయి. వినయుడు అటువైపే చూస్తున్నాడు.

"మీరు మమ్మల్ని యింట్లో ఉండనిస్తారా?"

పచ్చిగాయంమీద ఏదైనా తగిలితే దెబ్బతిన్న వ్యక్తి ఎలా ఎగిరిపడతాడో వినయుడు కూడా అలాగే అయి—"నాకేనా చెప్పేది?" అన్నాడు.

"ఆc—మీకు తెలియదా?"

ఏం జరిగి ఉంటుందబ్బా అని వినయుడు ఆశ్చర్యపోయాడు. వాసంతి అత్త నడగటానికి కూడా అవకాశ మివ్వకుండా కటుస్వరంతో అంది:—

"నిన్న ఏకాశి. మా అమ్మ గంగ కూడా ముట్టలేదు. ఇవ్వాళ రెండు మెతుకులు తిందామని కూర్చుంటే మీ కుక్క వచ్చి పళ్లెంలో మూతి పెట్టింది.

అతుపుచేసుకోలేనివాళ్లు కుక్కల్ని పెంచటమెందుకు? ఊళ్లో వాళ్ళని వేధించటమెందుకు?" ఈ మాటని వాసంతి కొంచెందూరం పోయి, మళ్ళీ ఏమనుకుందో వెనక్కు తిరిగింది. కాని ఏమీ మాట్లాడలేదు. వినయుడు తనవైపే చూస్తూ ఉండటం, అతనికళ్ళల్లో నీరు తిరగటం, ఆమె చూసింది. ఆశ్చర్యంవేసి మెల్లగా కిందికి వెళ్ళింది.

ఏమిటి తను అని వచ్చింది? ఇలా కటువుగా మాట్లాడాలనే ఉద్దేశంతో తను వెళ్లిందా? జరిగినసంగతి చెప్పి కుక్కయజమానిని హెచ్చరిద్దామనుకుంది. కాని తనెందుకిలా తూలింది? పాపం యిందులో అతని తప్పేముంది? అతనేమన్నా కుక్కకి నేర్పి పంపాడా?...ఇలా ఆలోచించినకొద్దీ ఆమెమీద ఆమెకే అసహ్యం వేసింది! పోనీ క్షమాపణ కోరితే—ఛీ! అంతకంటే సిగ్గు చేటేముంది! పోనీ జరిగిందేదో జరిగింది. ఇకముందునించి జాగ్రత్తగా నడుచుకుంటుంది.

కాసేపైనాక సోమూవచ్చి వాసంతితల్లితో—"మా బాబయ్య మిమ్మల్ని చూడాలనుకుంటున్నాడు" అన్నాడు.

"పద వస్తున్నాను" అని ఆమె చేతులో పని వదిలి లేచినుంచునేవరకు సోమూ "బాబయ్యగారే ఇక్కడికొస్తారట! మిమ్మల్ని కనుక్కు రమ్మన్నాడు" అన్నాడు.

వినయుడు తన దగ్గరకొచ్చి చూసి పోయేటంత జరూరు పనేమిటో ఆమె నిర్ణయించుకోలేకపోయింది—"ఇక్కడికి రావటానికికూడా నన్నడగాలా నాయనా! నాకు అబ్బాయి లాంటివాడు. అతనిష్టం వచ్చినప్పుడు రమ్మను" అంది.

వినయుడు రాగానే ఆమె పీటమీదనించి లేచి "రా, నాయనా! కూర్చో" అంది.

ఆమె స్నేహపూరిత కంఠస్వరంలో లేశమాత్రం విరక్తిలేదు. వినయుడు స్టూలుమీద కూర్చున్నాడు. ఎంత ప్రయత్నించినా తనెందుకొచ్చిందీ చెప్పలేకపోయాడు. ముసలమ్మ అతను పడుతున్న బాధ గ్రహించింది. "మీకు భోజనాలవీ సరిగ్గా అమరుతున్నాయా, నాయనా!" అంది.

"ఆఁ" అన్నాడు వినయుడు క్లుప్తంగా.

"మరేమీ ఇబ్బందుల్లేవు గదా?"

వినయుడు దానికి జవాబివ్వకుండా—"మా కుక్కపిల్ల—"

ముసలమ్మ మాట పూర్తికానివ్వకుండానే—"చాలా బాగుంది. ఎక్కడ తెచ్చావు నాయనా?" అంది.

"కొన్నాను. అది మీ విస్తట్లో మూతిపెట్టిందని తెలిసి నేను చాలా కష్టపడ్డాను."

"ఎవరు చెప్పారూ? వాసంతేననుకుంటా! అదేముంది నాయనా! నోరు లేంది! నా కసలు ఒంట్లో బాగాలేదు. లేకపోతే నేనే వచ్చేదాన్ని—ఈ భాగ్యానికేనా యింతదూరం వచ్చావు?"

వినయుడు జవాబు చెప్పటానికి మాటదొరక్క తన్నుకుంటున్నాడు. ముసలమ్మ రెప్పవాల్చకుండా అతనివంకే చూస్తూ ఉంది. వినయుడు "మళ్ళీ వస్తా" నంటూ నెమ్మదిగా లేచాడు.

"అప్పుడప్పుడు వస్తూ ఉండు నాయనా! ఇది మీ ఇల్లేననుకో. సరేగాని, మీ అమ్మ ఉందా?"

"ఆఁ" అన్నాడు వినయుడు. అతనికి ఆమె మాటలో మాతృప్రేమ కనిపించింది. తల్లే పిలిచినట్టుగా ఉంది.

"ఆమెకూడా నా యీడుదే కదూ?"

ఆమె ఈ విధంగా ఊహించేటందుకు ఆధారా లేమున్నాయో వినయుడికి అంతుపట్టలేదు. ఐనా "ఆఁ" అని "మళ్ళీ వస్తా" నంటూ సెలవు తీసుకుని బైటపడ్డాడు.

* * *

ఎప్పుడూ కులాసాగా ఉండే వ్యక్తికూడా ఏదన్నా షాక్ తగిలితే గంభీరు డౌతాడు. ఇప్పుడు వాసంతికూడా అలాగే ఐంది. కొన్నాళ్ళనించీ ఆమెలో ఈ మార్పుని తల్లి గ్రహిస్తూనే ఉంది. ఒకనాడామె కూతురితో "నువ్వింక స్కూలికిపోయి లాభంలేదు. ఇంట్లోవుండే చదువుకో!" అంది.

ఈ మాట వాసంతికి వెర్రెత్తించింది. తల్లిమీద ఎగిరపడింది. అప్పటినించీ తల్లికూడా కుమార్తె చదువుసంగతి మళ్ళీ ఎత్తలేదు. అసలు వాసంతిది చిరాకుస్వభావం కాదు. ఇప్పుడామెకు ప్రతిమాటకీ కోపమొస్తున్నది. దీనికి కారణ మేమిటో తెలియక తల్లి భయపడ్డదికూడా!

ఆ రోజున వాసంతి బండి దిగి మెట్లమీద అడుగుపెట్టిందో లేదో 'జో' వచ్చి చీర పట్టుకుంది. మిద్దెమీది ఘటనతర్వాత మళ్ళీ కుక్కపిల్ల కనిపించలేదు. అనేక కారణాలవల్ల ఆమెకు 'జో' అంటే తగనికోపం! ఇవ్వాళ అది ఆ పని చేయగానే ఆమె కోపం ఆపుకోలేక పోయింది. చేతిలో హిస్టరీ పుస్తకాన్ని దాని తలకు గురిచూసి విసిరింది. ముద్దుకుక్క బాగాలు దెబ్బతగిలే వరకు పాపమది 'కుంయి'మని ఏడుస్తూ మూడో అంతస్తుకు పరిగెత్తింది. ఇది చూసి తల్లి—"ఎందుకలా దాన్ని కొట్టావు?" అన్నది. "నాయిష్టం" అన్నది వాసంతి బిగ్గరగా. ఈ మాట మూడో అంతస్తుమీదనున్న విజయుడు కూడా విన్నాడు. అతనప్పుడే కాలేజీనించి వచ్చి మిద్దెమీద పచారుచేస్తున్నాడు. హఠాత్తుగా 'జో' అరుపు విని కిందికి చూశాడు. వాసంతి కనిపించింది. వాసంతికూడా పైకి చూసింది ఎవరన్నా ఉన్నారా అని! విజయుడు కనపడ్డాడు, తన వంక జాలిగా చూస్తూ. ఆమె ముఖం తిప్పుకుని వెనకటి మాదిరిగానే బిగ్గరగా అంది:—"పొగరుబోతుకుక్క! ఛీ అంటున్నా చంక నెక్కుతుంది!" ఈ మాట పడవలసినవాళ్ళ చెవిని పడింది. ఆమె ఉద్దేశం నెరవేరింది. కాని అతను మాత్రం ఎదురు మాట్లాడలేదు.

వాసంతిప్రవర్తన విజయుడికి ఆశ్చర్యమేకాదు విరక్తికూడా కలిగించింది. అతనికి కుక్కపిల్లమీద చాలా ప్రేమ. దాన్ని ఆవిధంగా, అన్యాయంగా దండించటం అతనికి కష్టం కలిగించింది. ఎవరితోనూ తగవు పెట్టుకోటం అతని స్వభావం కాదు. అంచేతనే మాట్లాడలేదు. అతనికి జోమీద చాలా కోప మొచ్చింది. సోమూ వచ్చేవరకు దాని నేరం విచారించి తీర్పు అమలు పరుస్తున్నాడు.

"ఎందుకు దాన్ని కొడుతున్నావన్నా?" అన్నాడు సోమూ.

"అది కింది కెళ్లట మెందుకు?"

కింది కెళ్లటం ఎంత పెద్ద నేరమో సోమూ కెలా తెలుస్తుంది ?

ఆనాటినించీ వినయుడుకూడా కొంచెం గంభీరంగా ఉండటం మొదలు పెట్టాడు. ఈ సంగతి వాసంతి గ్రహించింది. అతనిది గంభీరస్వభావం కాదని ఈ కొద్దిపరిచయానికే ఆమె గ్రహించింది.

* * *

ఆవాళ వినయుడు వార్తాపత్రిక చదివి అవతల పెట్టగానే సోమూ "బాబయ్యా, తీర్థానికి పోదాం, పద" అన్నాడు.

"ఏం తీర్థమోయ్, ఈ చలికాలంలో" అన్నాడు వినయుడు నవ్వుతూ.

"గంగాసాగరానికి బ..య్యా! దగ్గరేగా."

సోమూ అసలు సంగతి బైటపెట్టాడు. అతని పూర్వ స్నేహితుడు శ్రీరాంమోదీ ఈ తీర్థయాత్రకోసం కలకత్తా వచ్చాడట, సోమూనికూడా వెంట తీసుకెళ్లాలని అతని ఉద్దేశమట, వెళ్లటానికి తనుకూడా యిష్టపడ్డాడట! కాని, బాబయ్యగారికి కూడ తిండితిప్పలకు ఇబ్బందిపడతారని సందేహిస్తున్నాడట. బాబయ్యగారు బయలుదేరితేమాత్రం తను దూకటానికి సిద్ధంగా ఉన్నాడట.

వినయుడు సోమూ మాటలన్నీ విని— "నేను రావటం పడదు, సోమూ! పరీక్షకి ఫీజు కట్టాలి. నువ్వు పోయిరా" అన్నాడు.

"మిమ్మల్ని వొంటరిగా వదిలి నే నెట్లా పోయేది బాబయ్యా!"

సోమూ ఎంత బలవంతపెట్టినా వినయుడు బయలుదేరలేదు. ఇక గత్యంతరం లేక సోమూ—"ఐతే శేఖర్ గారి వంటబ్రాహ్మడితో చెప్పిపోతాను. అత నొచ్చి మీకు రెండు పూటలూ వొండిపెడతాడు. రామితో చెప్పి పోతాను, అది అంట్లు తోమిపెడుతుంది" అన్నాడు.

"సరే" అన్నాడు వినయుడు.

సాయంత్రం పోయి సోమూ వంటబ్రాహ్మడితోనూ రామితోనూ మాట్లాడి వచ్చాడు. వెళ్లే కిందటిరోజు సోమూ వినయుడికి ఎన్నో ఉపదేశాలు చేశాడు: ఈ నాలుగు రోజులూ రాత్రిపూట ఎక్కువసేపు చదవ

టానికని మేలుకోవద్దు; జబ్బు చేస్తుందేమో! కుక్కపిల్లని గొలుసుతో కట్టేసి ఉంచండి, లేకపోతే అది నాకోసం ఇల్లంతా గాలిస్తుంది.

సోమూ నమస్కరించి సెలవు తీసుకునేటప్పుడు వినయుడు హెచ్చరించాడు: "జాగ్రత్త సోమూ! అక్కడ కలరా ఉందట. డబ్బు కావలిస్తే ఇంకొంచెం ఎక్కువ తీసుకుపో!"

"నా సంగతి మీరేమీ ఆలోచించకండి. నేను సోమవారమే వచ్చేస్తాను. ఇంకొకటి, నేను వచ్చిందాకా గొల్లవాడికి డబ్బివ్వకండి. ముండాకొడుకు ఈ నెలంతా నీళ్ళు పోశాడు."

మధ్యాహ్నం వంటబ్రాహ్మడు తయారుచేసిన వంటకాలు వినయుడు నోట్లో పెట్టుకోలేక పోయాడు. విస్తరిముందునించి లేచి — "నేనే వండుకుంటాను స్వామీ! నువ్వేక రానక్కర్లేదు, నీకు రావలసిన రోజుజీతం సోమూ వచ్చి నాక పట్టుకెళ్ళు" అన్నాడు.

* * *

ఒకవారం గడిచాక వాసంతి మళ్ళీ మిద్దెమీదికి పచారుచేయటానికి వచ్చింది. కుక్కని కొట్టిందతనా వాసంతికి వినయుడు కనిపించలేదు. కుక్కని కొట్టినందుకు వాసంతి తర్వాత చాలా పశ్చాత్తాప పడ్డది — అంతకంటే ఎక్కువ పశ్చాత్తాపపడ్డది వినయుణ్ణి ఉద్దేశించి ఆమాట అన్నందుకు. ఆమె కావాలని వినయుణ్ణి అవమానించలేదు. అతనితో ఆమెకేమీ విరోధం కూడా లేదు. ఐనా, అప్రయత్నంగా కటువాక్యాలే వెలువడుతున్నాయి. ఒకళ్లు కొడుతూవుంటే, రెండోవాళ్లు ఆత్మరక్షణకోసంకూడా ఎదురు తిరగకుండా, గాంధిగారి సత్యాగ్రహతత్వం అవలంబిస్తే, మొదటివాడు నైతికంగా ఏమవుతాడు? మళ్లీ చెయ్యిలేస్తుందా అతనికి?– మొదట వాసంతి వినయుడు తన్ను మళ్లీ ఎదురుదెబ్బ కొడ్తాడని అనుకుంది. కాని ఒకవారమైనా అతను ఉదాసీనంగానే ఉన్నాడు. ఆమెకు కుతూహలం ఎక్కువైంది. తన మనస్సుకూడా ఆమె తన అదుపులో ఉంచుకోలేక మిద్దెమీదికి వచ్చింది. వినయుణ్ణి అవమానించినప్పటినించీ ఆమె ఒక్కొక్కరోజు ఎలా గడిపిందో

ఆ అంతర్యామికే తెలుసు! వినయుడు ఎదురుదెబ్బ కొడితే ఆమెకీ విచార ముండేది కాదు. ఈ చిత్రమైనవ్యక్తి దెబ్బ తినికూడా తొలిగిపోతాడు— తిరగబడడు! అతనితో యుద్ధం చెయ్యడ మెలా?

మిద్దెమీద ఎవ్వరూ లేరు. ఒక మూలనుమాత్రం జో పిండివేసిన తెల్ల గుడ్డమాదిరి ముడచుకొని పండుకున్నది. అది చీకటిగా ఉంది. వినయుడు ఎక్కడకి పోయినట్లు? జోని, ఆ నోరులేని పశువుని అడిగితే? దాని యజమాని ఎక్కడికెళ్లాడో?— ఈ ఆలోచనతోపాటు ఆమెకి తన దుర్బలత్వం తెలిసింది. ఆమె ఆత్మ ఎదురు తిరిగింది. ఒకమాటు కుక్కనిపిల్చి చూడా లనుకుంది!—కుక్క ఇదివరకు మాదిరిగా ఇప్పుడు దగ్గరికి రావటంలేదు. ఆవాళ కొట్టినప్పటినించీ అది కిందికికూడా రాలేదని ఆమెకి జ్ఞాపకం వచ్చింది. జంతువులికికూడా మంచీ చెడూ తెలుసు! ఈ సాంఘ్యజ్ఞత ఆమెకి భరించరానిదిగా తోచింది. వినయుడిలాగ ఆమెమీద అలిగి, మాట్లాడటంలేదా అన్నట్టుంది! ఆఖరికి కుక్కకూడా! క్రమంగా ఆ యిల్లంతా ఆమెచేసిన అన్యాయానికి ప్రతీకారం చేస్తున్నదా అనిపించింది.

వాసంతి ఇక ఉండలేక 'జో' అని పిలిచింది. జో తోక ఆడిస్తూ లేచి నుంచుంది. వాసంతి పులకితురాలై మరోసారి 'జో' అంది. జో రెండడుగులు వేసిందో లేదో కింది గదిలోనించి "జో! ఇల్లారా" అనే స్వరం వినిపించింది. జో ఒక్కగంతున కిందికి వెళ్ళిపోయింది.

వాసంతి స్తబ్ధురాలైంది. వినయుడు ఇలా తిరిగి దెబ్బతీస్తాడని ఆమె కలలోకూడా అనుకోలేదు. ఆ దెబ్బను తట్టుకునే శక్తికూడా ఆమెలో లేదు. ఆమెకళ్ళు తడిసిపోయినై.

"ఏం? నేనేం తప్పు చేశాను?"—తన శక్తినంతా వినియోగించి ఈ మాటలంటూ ఆమె కిందికి దిగింది. కాని, చావబోయేవాళ్ల అస్ఫుట ఆర్త నాదంమాదిరిగా అవి గొంతులో పట్టుకుపోయినై. వాటి భావం వినయుడు గ్రహించలేక పోయాడు.

* * *

ఆనాటి మామూలుఘటన వాసంతిలో చాలామార్పు తెచ్చింది. తల్లికూడా యిది గ్రహించింది. వాసంతి మర్నాటి ఉదయం దిగులుగా కూర్చుంది. స్కూలు కారువచ్చి తిరిగిపోయింది. స్నేహితురాలు విమల అత్తగారింటికి పోయేముందు చూసిపోవడానికి వచ్చింది. వాసంతి ఆమెతో సరిగా మాట్లాడ లేదు. పత్రికలవాళ్ళ బంట్రోతు చందాకోసం వచ్చి, గద్దింపుతో పారి పోయాడు! ఆమె కళ్ళవెంట నీరు కార్చలేదంటానికికూడా వీల్లేదు. వినయు డెంత అభిమానో నిన్న గ్రహించింది. ఆ రెండు మాటల్లోనే అతని హృదయంలో బాధని స్పష్టంగా చూడగలిగింది.

ఇంతకాలంనించి ఆమె వినయుణ్ణి నొప్పిస్తూనే వచ్చింది. వినయు డాబాధ ఈనాడు ఆ రెండుమాటల్లో వెల్లడించాడు. వాసంతి హృదయం ఆత్మగ్లానితో వేగిపోతోంది. క్షమాపణకోరితే బహుశా ఈ జ్వాలనించి తప్పించుకోవచ్చు. కాని, అంతకంటే సిగ్గుచేటు యింకొకటుందా? ఛీ!— తర్వాత ఆమె ఆలోచనా ప్రవాహాన్ని ఇంకోవైపుకు తిప్పింది:— ఎందుకూ అతన్నిగురించి యింత ఆలోచన? ఎక్కడివాడని? నాలుగు రోజులు ఇల్లద్దెకి తీసుకున్నాడు. అతన్నిగురించి రాత్రింబవళ్లూ ఈచింత ఎందుకు? అతన్ని తలకపోతే పీడా వదలిపోతుంది! కాని, ఆమె మనస్సే ఆమెకి శత్రువైకూచుంది గదా! మనసు మర్చిపోదే తనేంచేస్తుంది?

రామి పైనించి దిగివస్తోంది. వాసంతితల్లి కొత్తమనిషినిచూసి "ఎక్కడుంటున్నావ్" అని అడిగింది.

"మూడ్రో అంతిస్తాయనదగ్గర పాచిపని చేస్తున్నా"నంది రామి.

"పాతిన్నాక ఎక్కడి కెళ్ళావు?"

"తీరానికి."

"మరి మీ బాబుకి ఎవరొండి పెడుతున్నారు?"

"అదంతా చాలా గోల ఉందమ్మా! మధ్య వొక వంటాయన వచ్చాడు, దౌర్భాగ్యుడు. అతను వండింది ఒక్కపూటకూడా తినలేక పోయాడు. పాపం యిప్పుడు ఆ బాబయ్యే ఒకపూట వొండుకొని రెండు

పూటలా తింటున్నాడు. ఆ వంటకూడా ఏమిటి? ఉడకీ ఉడకని మెతుకులు. కూర అసలు నోటే పెట్టవల్లకాదు. దానితోనే రెండుముద్దలు తింటే తింటాడు లేకపోతే అంతా కుక్క పాలు. పాపం!ఎవ్వరో ధనవంతు లబ్బాయి. ఎప్పుడు చెయ్యి కాల్చుకున్నరకం కాదు. వంట ఎలా చేస్తాడు? పైగా రాత్రింబగళ్లు చదువు. ఇక చెప్పు తల్లీ! జబ్బు చెయ్యకుండా ఎలా ఉంటుందో? నిన్న తలనొప్పి వచ్చిందని పండుకున్నాడు. రాత్రేమీ తినలేదు. ఇవ్వాళ ఉదయం పాలుతాగుతాను, ఇకేమీ అక్కర్లేదంటాడు. నే నెంతబతిమాలినా వినలేదు. అందుకనే కుర్రాడు అన్నం తేటానికి హోటలుకు పోతున్నాను. ఏమమ్మా, ఈయిల్లు మీదేకదూ?" అని తల ఎగురవేయించుకుని వెళ్ళిపోయింది.

వాసంతి ఇంతవరకు శ్వాస బిగబట్టి వింటున్నది—ఎవరన్నా వింటారేమోనని గాలికూడా విడవ లేదు. వాసంతితల్లి కూతురివంకకు తిరిగి—"విన్నావా, సంతీ ? ఇప్పుడు నన్నేం చెయ్యమంటావు? మన కళ్ళఎదుట ఒక కుర్రవాడు తిండిలేకుండా మాడిపోతుంటే చూస్తుండాల్సిందేనా ? చెప్పు?—నా కీ పద్ధతి బాగా లేదు. ఏమంటావ్ ?" అన్నది.

"నే ననేదేముంది? నీ యిష్టమొచ్చినట్టు చెయ్యి" అని కాసేపు ఊరుకుని మళ్ళీ అన్నది—"వద్దమ్మా! నువ్వన్నం వొండిపెట్టొద్దు! అలాగయితే—"

"అలాగయితే ?"

"ఏమీలేదు!—నువ్వొండిపెట్టొద్దు! ఏమాత్రం వొద్దు!"

"ఐతే నువ్వే ఈ యింట్లో ఉండు. నే నెక్కడైనా వెళ్ళిపోతా." అని తల్లి కోపంతో వెళ్ళిపోయింది.

వాసంతి విస్తుపోయి, గోడ పట్టుకుని మూడో అంతస్తు మెట్లవంక చూస్తూ నిలబడింది. ఆమె తన్ను ఎదిరించిన మనస్సును రెండు చేతులతోనూ పట్టి నలిపివెయ్యా లనుకుంది. ఈ అదృశ్యపదార్థం ఒక క్షణం ఇంత కోమలంగానూ, మరో క్షణం అంత కఠినంగానూ ఎందుకవుతుందో ఆమె కర్థం కాలేదు. అందుచేతనే ఆమెకు తన చేతగానితనంమీద కోపంవచ్చింది!

* * *

మధ్యాహ్నం తనకూ కూతురికీమధ్య ఆ సంభాషణ జరిగినాక తల్లికి కొంచెం దిగులు పట్టుకుంది. ఆ సాయంత్రం తల్లి ఒంటరిగా కూర్చుని ఏకాదశి ఎప్పుడో వేళ్ళతో లెక్క వేసుకుంటూ ఉండగా వాసంతివచ్చి దగ్గరకూర్చుని "అమ్మా! నీకు కోపమొచ్చిందా?" అని అడిగింది.

తన ప్రతిపనికీ కూతు రిలా అడ్డురావటంచూసి తల్లికి కష్టంగానే ఉంది. కాని అప్పటి కూతురుగొంతు వినేవరకు ఆమె అభిమానమంతా కరిగిపోయింది. కూతుర్ని దగ్గరకి తీసుకుని—"కోప మెందుకు, తల్లీ?" అన్నది.

తల్లి ఆదరానికి వాసంతి ఏడ్చింది. ఇన్నాళ్ళనుంచీ ఆమెలో క్రమంగా గడ్డకట్టుకు పోయిన వేదనంతా తల్లి ప్రేమపూరితవాక్యాలు వినంగానే కరిగి అశ్రురూపంగా ప్రవహించింది. తల్లికిమాత్రం కుమార్తె దుఃఖానికి కారణం తెలియలేదు.

"ఏడుస్తావెందుకు, తల్లీ?" అంది.

"నాకేమీ బాగాలేదమ్మా! స్నేహితురాలింట్లో వదిలిరా నన్ను" అంది.

"ఎందుకూ? నిన్ను రమ్మనిరాసిందా?"

"ఉహుఁ. వస్తానని నేనే ఉత్తరం రాశా."

"ఐతే జవాబురానీ, వెళ్ళుదువుగాని—సరేగాని నీకై నువ్వువెళ్ళితే వాళ్ళే మనుకుంటారు?"

తల్లి వేసిన ప్రశ్న వాసంతికి కొంచెం అనుకూలంగా ఉంది. ఆమె వెంటనే "మరి, నీకై నువ్వడిగి పైకెందుకు వెళ్ళావు?" అంది చప్పున. కాని తన గొంతులో కంపనం తల్లి ఎక్కడ గుర్తిస్తుందో, తనెక్కడ పట్టుపడతానో అని ఆమె చాలా భయపడింది.

కాని తల్లి కుమార్తె ప్రశ్నలో కృత్రిమత్వాన్ని కనిపెట్టింది. అందుకనే కొంచెం ఆగి — "అలా వెళ్ళటంతప్పా, సంతీ? మనింట్లో ఉండే అబ్బాయి జబ్బుపడితే పోయి కళ్ళతో చూసిరావటంకూడా తప్పేనా? అన్నం వండి పెడితే తప్పయితే కావచ్చుకాని!" అన్నది.

చివరిమాటలో వ్యంగ్యానికి వాసంతి చాలా నొచ్చుకున్నది. ఆమె తల్లివైపు చూడకుండానే, కటువుగా—"మాటిమాటికీ నన్ను ఎత్తిపొడుస్తా వెందుకూ? నీకిష్టమైతే వండి పెట్టుకోరాదూ? నేను రేపే నా స్నేహితురా లింటికి పోతున్నాను" అని జవాబుకూడా ఎదురుచూడకుండా వాసంతి తన గదిలోకి పోయింది.

మనస్తత్వం స్త్రీలకి అందుబాటులోవిద్య. పూర్వం సందేహంగానూ అస్పష్టంగానూ ఉంటున్న అనేకవిషయాల్ని తల్లి ఇప్పటి కూతురు మాటలను బట్టి విశ్వాసం కిందికి మార్చుకుంది. ఏదో తెలియని భయంకూడా ఆమెని ఆవరించింది.

* * *

వారం లోపలే సోమూ రావలసినమాట. ఇవ్వాళకు పన్నెండు రోజు లయినా వాడి జాడేలేదు. వినయుడు అధీనుడై ఆతీరంలో వుండే సేనా సమితులన్నిటికీ సోమూ పోలికలు తెలుపుతూ ఉత్తరాలు రాశాడు. ఇప్పటికి ఒక్కదానికికూడా జవాబు రాలేదు. పరీక్షలు దగ్గరికొచ్చినై. ఇదొక నరమేధం! పైగా రోజూ స్వయంపాకం - అత్తనివల్ల కాకుండా ఉంది. వినయుడు పక్కమీదపండుకొని ఆలోచనలో పడ్డాడు. హఠాత్తుగా అతని ఆలోచన తెగింది, కిటికీలోంచి మిద్దెమీదికి చూశాడు—వాసంతి జుట్టు ఆర బెట్టుకుంటున్నది మిద్దెమీద. ఆమె ఎంతో అందంగా ఉంది. ఒంటరిగా ఉండగానే మనస్సు కల్పనారాజ్యంలోకి పోతుంది. కొన్నాళ్ళనించి వినయుడు ఏకాకి. అతనికి ఒంటరితనం అసహ్యమేసిపోయింది. వచ్చినప్పటి నుంచీ వీరిద్దరిమధ్యా మూకసంగ్రామం జరుగుతూ ఉంది. ఏదోవిధంగా సంధి జరిగిపోతే ఈ ఏకాంతవాస శిక్ష తప్పించుకోవచ్చు. వినయుడు మెల్లగా బయటికివచ్చి వాసంతి నుద్దేశించి - "చూడండీ—!" అన్నాడు.

ఈ గొంతు వినేవరకు వాసంతిశరీరం ఝల్లుమన్నది. తన మనో దౌర్బల్యం ఎక్కడ బయట పడుతుందో నన్న భయంతో ఆమె కొంచెం కటువుగా—"నన్నేనా పిల్చింది" అన్నది. పళ్లు బిగబట్టుకుని ఈ మాట

అన్నదేగాని వినయుడి ముఖంవంక చూడలేకపోయింది. తన ముఖంమీద వికసించిన ఎర్రరంగు దాచుకోవలసిన అవసరంకూడా ఆమెకు కలిగింది.

"ఆఁ. నాకేమన్నా ఉత్తరమొచ్చిందేమో చూసి చెప్తారా? సోమూ పోయి చాలా రోజులైంది—"

వినయుడిమాట పూర్తి కాకముందే వాసంతి "ఉత్తరాలసంగతి నాకు తెలియదు. కావల్సిస్తే పోయి లెటరుబాక్సు చూచుకోండి!" అని చకచక దిగిపోయింది, వినయుడికి మళ్ళీ మాట్లాడటానికికూడా అవకాశ మివ్వకుండా.

వాసంతి ప్రవర్తన వినయుడికి అవమానకరంగా తోచింది ఇవ్వాళే— ఇదివరకు లేదు. ఇవ్వాళమాదిరిగా అతనెప్పుడూ, ఆ పిల్లని, ఆ కటు స్వభావురాలిని లక్ష్యపెట్టి తాను పలకరించలేదు. ఇదే అతని మొదటిప్రయత్నం. ఇద్దరిమధ్యా ఇన్నాళ్ళనించీ పెరిగివస్తూఉన్న విరోధం ఇవాళ్తో తేలిపోతుం దనుకున్నాడు. కాని అతని ఆశ అడియాశ అయింది. వాసంతి జవాబు వినేవరకి అతనికి చాలా కష్టమేసింది—విసుకూడా పొయ్యాడు! సోమూ కోసం అతనిమనసు చాలా ఆందోళనపడుతున్నది. ముందు, అతనిగోడువ చెప్పుకుంటే వినేవాళ్ళే లేరు—సానుభూతి చూపేవాళ్ళసంగతలా ఉంచి!

* * *

మెట్లు దిగుతూ దిగుతూ వాసంతి ఏడ్చింది. నిత్యమూ జరుగుతున్న ఈ అంతర్యుద్ధానికి ఆమె మనస్సు తూట్లుపడింది. ఆబాధ సహించేశక్తికూడా ఆమె కోమలహృదయంలో లేదు. ఐనా ఆమెకి సత్యంలోపం కనిపించలేదు. తనప్రయత్నంలో లోపమేమీ చెయ్యలేదు. ఎన్నోసార్లు వినయుడితో మామూలుగా మాట్లాడాలని ప్రయత్నించింది. కాని ఆమె మనస్సు ప్రతిసారీ ఎదురు తిరిగింది. చనువుగా మాట్లాడితే వినయు డెక్కడ దుర్భావనపడ తాడో 'ఈ పిల్ల తనతో మాటలు కలుపుకోటానికి ప్రయత్నిస్తున్నదని' అని. అందుచేతనే ఆమె బలవంతానైనా కటువుగా మాట్లాడి తన ఆత్మగౌరవం కాపాడుకోవాలని వ్యర్థప్రయత్నం చేసింది.

వాసంతి తల్లి కిందమెట్టుదగ్గర నిలబడి ఉత్తరం చదువుతోంది.

వాసంతి దిగివచ్చి — "అమ్మా! మూడో అంతస్తువాళ్లకేమన్నా ఉత్తర ముందా?" అన్నది బొంగురుగొంతుతో. కాని మాటజారిన తర్వాత ఆమె భయపడింది.

"ఏమిటీ?" అన్నది తల్లి వెనకటిది వినక.

వాసంతికి సగంబాధ తప్పింది. "ఏమీ లేదమ్మా! ఉత్తరం చదువుతుంటే ఎవరిదని అడుగుతున్నా!" అని, తప్పుకుంది.

"మీమామ నిన్న దేవఘుర్ రమ్మని ఉత్తరంరాశాడు. నీ కెప్పుడు వీలో చెపితే వచ్చి తీసుకుపోతాడట."

"నే నెక్కడికీ రావటంలేదని రాసెయ్యమ్మా, నా వొంట్లో బాగాలేదు!"

"నీతత్వ మేమిటో అర్థం కాలేదే, సంతీ! ఆవాళ నీ స్నేహితురాలింటికి పోవాలని అంత తొందర పడితివి; ఇవ్వాళ మామగారి దగ్గరకి పొమ్మంటే-"

తల్లిమాట పూర్తికాకముందే వాసంతి విసుగ్గా "నా ఇష్టం. నేను పోను" అన్నది.

తల్లి ఏమో చెప్పబోతుండగా మెట్లకింద చప్పుడూ, ఆర్తనాదం వినపడింది. తల్లి ఆశ్చర్యంతో "అదేమిటే? చూడు సంతీ, ఎవరో పడిపోయినట్లున్నారు?"

వాసంతి పరుగెత్తుకుంటూ పోయి, వెలవెలపోతున్న మొహంతో తిరిగివచ్చి— "ఒకఅడుగటు వెయ్యి, అమ్మా! ఏమిటో కనుక్కో" అన్నది.

వినయుడు ఉత్తరాలకోసం కిందికి దిగివచ్చి కళ్లు తిరిగి పడిపోయాడు. కొన్నాళ్ళనించీ అతనికి తిండీ నిద్రా సరిగా లేకపోవడంవల్ల అతనిశరీరంలో పిసంతకూడా శక్తిలేదు. పైగా తల్లినించి సంక్రమించిన గుండెజబ్బుకూడా ఉంది అతనికి. ఇక పరీక్షల చింతా సోమూ దిగులూ అన్నీ కలిసి ఈ మూర్ఛకు కారణమైనవి. ముసలమ్మకు వినయుడిస్థితి చూసేవరకు ఏడుపొచ్చింది. ఆమె ఏడుస్తూనే—"పోయి నీళ్లు తీసుకురావే!—అయ్యో బతికేదేమో ఖర్మం!" అన్నది కూతురితో.

వాసంతి నీళ్ళు తెచ్చి వినయుడి కాళ్ళదగ్గర పెట్టగానే తల్లి—"మూర్ఛల్లే ఉంది. ముఖాన నీళ్ళుకొట్టు" అన్నది.

వాసంతి యంత్రంలాగా నీళ్ళు చల్లనారంభించింది. వినయుడికి కాసేపటికి స్మృతి వచ్చింది—అతను కళ్ళు తెరిచేవరకు మొట్టమొదట కనిపించింది వాసంతి. మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు. ఇంతవరకు వాసంతి తనపని తాను చేసుకు పోతూఉంది. ఇతర ఆలోచనలకి ఆమె మనసులో తావే లేక పోయింది. ఇప్పుడు వినయుడిలా కళ్ళు మూసుకునేవరకు ఆమెకు వెనకటి సంగతులన్నీ ఒక్కుమాటు జ్ఞాపకంవచ్చాయి. ఉపేక్ష, ఎత్తిపొడుపుల బాధ ఎంత తీవ్రంగా ఉంటుందో వినయుడికోమాటు తన ప్రవర్తనవల్ల వాసంతికి చూపించాడు.

డాక్టరువచ్చి నాడీ గుండే పరీక్షించి—"టైఫాయిడ్. బంధువు లెవరైనా ఉంటే కబురు చెయ్యండి" అన్నాడు కష్టంగా.

"అతని దేవూర్లో మాకు తెలియదు డాక్టరుగారూ," అన్నది వాసంతితల్లి.

"ఇంట్లో ఉత్తరా లేమన్నా ఉన్నాయేమో చూసి టెలిగ్రాం ఇవ్వండి...లక్షణాలు చూస్తే అంత బాగాలేవు" అన్నాడు డాక్టరు.

"ప్రాణమొప్పం లేదుగా ?"

"ఎలా చెప్పేది ? చాలా రోజులనించీ లోలోపల జబ్బు పెరిగింది. తిండీ తిప్పలూ సరిగా లేకపోవటం—"

వాసంతి ఇంతవరకూ మెదలకుండా నిలబడ్డది. డాక్టరుగారి మాటలు వింటున్నకొద్దీ ఆమెకి గుండెదిగులు ఎక్కువైంది. తిండీ తిప్పలు సరిగా లేకపోవటం !—దీనికి బాధ్యులెవరూ ? తనుకాదా ?—

వాసంతి ఇక వినలేకపోయింది. గోడపట్టుకుని మెల్లగా గదిలోకి పోయింది. ఆమెకు కన్నీరాగలేదు. ఆత్మగ్లానీ, ఉత్కంఠత, వేదనవల్ల కలిగిన అశ్రువులు ఆమె మిథ్యాభిమానాన్ని కడిగివేసినై. వినయుడు గనక పిలిచి తనతో ఒకసారి మాట్లాడితే క్షమాపణ కోరాలనికూడా అనుకుంది.

వినయుడిస్థితి సందిగ్ధంగా ఉంది. ఈమధ్య రెండు మూడు సార్లతనికీ

స్మృతి వచ్చింది. తెలివి రాగానే "అమ్మా" అని పిలిచేవాడు. "ఇదిగో, వస్తున్నాను, నాయనా!" అని వాసంతి తల్లి దగ్గరికిపోయి కూర్చునేది.

"సోమూ రాలేదా?" అని అడిగేవాడు.

"వస్తాడు నాయనా, ఉత్తరంకూడా వచ్చింది."

"వాడు కులాసాగా ఉన్నాడా?" అని, మెదలకుండా ఊరుకునేవాడు. వాసంతికూడా రాత్రింబగళ్లు తల్లితోపాటు రోగికి సేవచేసేది. కాని ఆసేవలో జీవముండేదికాదు. యంత్రంలాగా తల్లిచెప్పింది చేస్తూ ఉండేది. మధ్య మధ్య పాలిపోయిన వినయుని ముఖంవంక చూసేది. కళ్లలో నీరు తిరిగినప్పుడుమాత్రం ముఖం పక్కకు తిప్పుకునేది. తల్లి ఇది గ్రహించి కూతుర్ని ఏదో వంకమీద అక్కడనించి పంపేది.

మూడోనాటి ఉదయం కిందవాకిలితలుపెవరో తట్టారు. వాసంతితల్లి పోయి తలుపు తెరిచింది. బండిమీదకూర్చున్ననౌకరు "వినయబాబున్నాడా?" అని అడిగాడు.

ఆమె వినయుడితల్లి వచ్చివుంటుందని గ్రహించింది. బండిలోనించి దిగిన ప్రౌఢ— "ఎక్కడా వాడు? బాగున్నాడా?" అని అడిగింది.

"నీకు ముఖం ఎలా చూపేది చెలీ? మీఅబ్బాయి మా యింట్లో తిండీ తిప్పలూ సరిగా లేక—"

"ఓ, నువ్వా? వదినే! - ఐతే ఇంకేం, వాడు తల్లిదగ్గరున్నట్టే—"

"నన్నింకా సిగ్గుపరచమాకు వదినా! నేను తల్లినిగాను; రాక్షసిని! నా యింట్లోనే చూసేవాళ్ళు లేక మీ అబ్బాయి ఇలా అవస్థపడితే పైగా నువ్వు నన్ను తల్లి అంటున్నావా!—పద నీ అబ్బాయిని నువ్వు అప్పగించుకుని నన్ను వదిలిపెట్టు. వాడి మొహం చూడటమంటే నాకు సిగ్గేస్తున్నది."

పాత స్నేహితురాళ్ళిద్దరూ కలియటమూ, మాట్లాడటమూ అయ్యాక వాసంతి చాటుగా, "ఎవరమ్మా యీమె?" అని తల్లిని అడిగింది.

తల్లి వెనుకటి సంగతులన్నీ పూసగుచ్చినట్టు చెప్పింది; వాసంతి విన్నది. కాశీలో దశాశ్వమేధం ఘట్టంవద్ద ఇద్దరికి ప్రథమపరిచయం; ఆ పరిచయమే క్రమంగా స్నేహంగా మారింది. వివాహమయాక ఇద్దరికి

ఎడబాటు. చాలకాలమైనాక వాసంతి గర్భంలో వుండగా - ఇద్దరూ మళ్ళీ ఒకసారి రైల్లో కలిశారు. అంతే! తరువాత పదిహేను సంవత్సరాల కుగా ఇదే కలవటం—

ఇంతలో వినయుడి తల్లిమాట వినపడి వాసంతి చకితురాలై లేచి, పోవాలని బయలుదేరింది. వినయుడి తల్లి ఆమె చేతిని పట్టుకొని, "మా మాలక్ష్మివి—రా తల్లీ!" అని కావిలించుకుంది.

ఈ ప్రేమపూరిత వాక్యాలు వాసంతికి ఎద్దేవా చేస్తున్నట్టుగా తోచినై. ఇంత ప్రేమకు తను పాత్రురాలు కాదు. అందుకనే ఆమె ఏడ్చింది.

"ఎందు కేడుస్తావు తల్లీ! ఏమీ భయంలేదు. త్వరలోనే లేచి తిరుగు తాడు. నీకు తెలియదనుకుంటా - వాడసంగతి? కాస్త జబ్బుచేస్తే చాలు - ఇలాగే హడావుడి చేస్తాడు, దబ్బున నయం చెయ్యమని దేవుణ్ణి ప్రార్థించు" అని వినయుడి తల్లి కళ్ళు తుడుచుకుంది.

వాసంతి ముఖం విచారంలో కూడా సిగ్గుతో ఎర్రపడ్డది — తను ఎందు కేడుస్తూందో కూడా చెప్పేందుకు వీల్లేదు. అందుచేతనే పెదలకుండా అన్నీ ఆమోదించినట్టుగా ఊరుకుంది. కాని యీ ప్రార్థనలేమిటి! అపరిచిత యువకుడు...పరిచయ మైనప్పటినుంచీ ఇద్దరూ రోజూ కీచులాడుకుంటు న్నారు...అతనికోసమా తను ఏడవటం! ఎక్కడి చిత్రం ఇది! అయినా ఇంకో మార్గం లేదు. ఇవ్వాళ ఏం చెప్పికూడా తను యీ విపత్తునుంచి తప్పించుకో లేదు.

ఈ సమయంలోనే ఎంతో తప్పు చేసినవాడిలాగు సోమూ ఇంట్లోకి వచ్చి, యజమానురాలికి సాష్టాంగ ప్రణామంచేసి భోరున ఏడ్చాడు. వినయుడి తల్లి ఓదార్చినకొద్దీ వాడి ఏడుపు ఎక్కువైంది. ఏడుస్తూనే వాడు తన కథంతా చెప్పాడు. గంగాసాగరం పోగానే వాడికి కలరా తగిలిందట. గంగానమ్మ దయవల్ల యీసారికి తను బతికి బైట పడ్డాడట. ఇక బాబయ్యకు నయమైతే వాడు బతికిపోయినట్టే నట. కాళికి రూపాయిపావలా కానుక వేస్తానని కూడా మొక్కుకున్నాడట—ఇవన్నీ చెప్పి సోమూ బయలు దేరాడు.

"ఎక్కడికి పోతున్నావ్ ?" అంది వినయుడి తల్లి.

"డాక్టర్ని పిలుచుకొస్తాను.

"డాక్టరు ఇంతకు ముందే వచ్చిపోయాడు. త్వరలో నయమౌతుందని కూడా చెప్పాడు..."

"ఈ నల్లడాక్టర్ కేం తెలుసునమ్మా? ఆస్పత్రికిపోయి తెల్ల డాక్టర్ని పిల్చుకొస్తా" అని వాడు జవాబుకూడా ఎదురు చూడకుండా బైటికి వెళ్ళిపోయాడు.

* * *

మూడో అంతస్థులో వినయుడు ఒంటరిగా పడుకున్నాడు. సోమూ, తెల్లదొర వచ్చి నమ్మకం చెప్పి వెళ్ళాక నిశ్చింతగా వాకిటిదగ్గర చాపవేసుకొని కునికిపాట్లు పడుతున్నాడు. కింద రాచమార్గంలో మనుషుల గోల అస్పష్టంగా వినిపిస్తున్నది. వినయుడు రకరకాల ఆలోచనలో పడ్డాడు. ముఖ్యంగా వాసంతినిగూర్చే అతను ఆలోచిస్తున్నాడు. ఇవ్వాళ ఉదయం ఆమె తన మంచందగ్గర నిలబడివుండటం చూశాడు. వాడిన ఆమె ముఖమూ, దిగులుగా వున్న కళ్ళూ తలపుకు వచ్చేవరకు అతనికి ఆశ్చర్యమేస్తున్నది! అలాంటి కర్కశ స్వభావంగల పిల్ల తప్పు చేసిందానిలాగ ఎందుకు ముడుచుకుపోతుందో, ఎందుకు దిగులు పడుతుందో అతనికి అర్థం కాలేదు. ఈ సైకాలజీని విమర్శిస్తూనే అతను ఇంతవరకూ గడిపాడు. ఇలాంటి విషయాలు పరిష్కరించటానికి కావలసినంత స్త్రీచరిత్ర వినయుడికి తెలియదు—ఈసంగతి తెలివిగల పాఠకులు ఇదివరకే గ్రహించివుంటారు. అతికోమలమే కటువుగా బైట పడుతుందనీ, వృషభ, గాంధార, దైవత, నిషాదల తగ్గు స్వరాలు కలిసే భైరవి రాగాన్ని సృష్టిస్తాయని అతనికి బొత్తిగా తెలియదు. అందుకనే వాసంతిలోని యీమార్పు క్లిష్టసమస్యగా తోచింది. దాన్నితను విడదీయలేకపోయాడు. ఈ సమస్య అతనికి ఉదయం ఎంత జటిలంగా వుందో సాయింత్రం అలాగే ఉండిపోయింది. ఇలాటి సమయంలో ఆ సమస్యామూర్తి కంఠస్వరం వినపడేవరకు చకితుడయాడు.

వాకిటిదగ్గర ఆమె ప్రత్యక్షమవగానే కళ్ళు మూసుకున్నాడు—తన మనసు లోని ఆలోచనలు ఎక్కడ బైట పడతయ్యోనని !

"సోమూ ! లే—కిందికి పో, అమ్మ పిలుస్తోంది" అంటూ సోమూను నిద్రలేపి కిందికి పంపి వాసంతి గదిలో ప్రవేశించింది. వినయుడు నిద్ర నటి స్తున్నాడని ఆమె గ్రహించలేదు. ఆమె మంచందగ్గరకు వచ్చి వినయుడి నొసటిమీద చెయ్యిపెట్టి వేడి చూసింది; తరువాత విసనకర్ర తీసుకొని వినయుడి ముఖంవంక చూస్తూ విసర నారంభించింది. ఆమె చూపులో ప్రేమే కాదు శంకకూడా కలిసి ఉంది. వినయుడు లేవగానే చేతులోని వీనన యథాస్థానాన ఉంచి, వెళ్ళిపోవాలని ఆమె ఉద్దేశం. కారణం— ఇంతకు ముందెప్పుడూ ఆమె అతను మేల్కొని వుండగా సేవ చెయ్యలేదు.

వినయుడు ప్రమాదాన్ని గుర్తించాడు. వాసంతిలో గది వదిలిపెట్టే లక్షణాలేవీ కన్పించలేదు. ఆమె చేతిలో విసనకర్ర విశ్రాంతి లేకుండా అతని శరీరంమీద ఆడుతున్నది !

నిద్రపోతూ పన్నెండు గంటలైనా కళ్ళు మూసుకోవచ్చు కాని, మేల్కొని పది నిమిషాలుకూడా కళ్ళు మూసుకోలేరు. అందులో రోగికి మరీ కష్టం. కళ్ళు తెలిస్తే ప్రమాదం ! వాసంతి ఎదట పడుతుంది ! చూశాక ఆమెతో ఏదో మాట్లాడాల్సి వుంటుంది............ఏం మాట్లాడితే ఏ మౌతుందో ! ఇద్దరి సంబంధమూ చిత్రమైన స్థితిలో వుంది—ఎంత ఆలో చించినా వినయు డేమీ నిశ్చయించ లేకపోయాడు. ఇటు కళ్ళు మూసుకు పడుకోవటం అతనికి దుర్భరమయింది. ఇక గత్యంతరం లేక ఈ విపత్తులోంచి తప్పించుకోవటానికి, "అమ్మ నొకమాటు పిలవండి" అన్నాడు కళ్ళు మూసుక్నానే !

ఈమాట వినగానే వాసంతి చేతిలోని విసనకర్ర క్రింద పడిపోయింది. ఆమె అదరాబాదరా మంచం దిగి కిందికిపోయింది. వినయుడిది దొంగనిద్రని వాసంతి గ్రహించింది. ఇలా పట్టుపడతానని ఆమె అనుకోలేదు. మెట్లమీదికి వచ్చి తన యీ పరాజయాన్ని గూర్చి ఐదారు నిమిషాలు ఆలోచించింది; సిగ్గుతో ఆమె ముఖం ఎర్రపడ్డది. ఈపిల్ల కోరి తనతో మాట్లాడేందుకు

వచ్చిందని వినయుడు అనుకొనివుంటాడు. నిజానికి తను సేవ చేసేందుకే వచ్చింది—మరో దురుద్దేశ మేమీ లేదనే సంగతి వినయుడికి ఏదోవిధంగా చెప్పగలిగితే! అప్పుడీ పరాజయపు సిగ్గునుంచి తప్పుకోవచ్చు. కాని, చెప్పే విధానం మాత్రం ఆమె నిశ్చయించుకోలేకపోయింది. అప్పుడు ఆమె తీవ్ర సంకల్పం వొకటి చేసి కిందికి దిగింది. సఖులిద్దరూ పైకి వస్తున్నారు.

వినయుడి తల్లి వాసంతి వైపు చూసి, "ఎండలో నిలబడ్డావా తల్లీ—ముఖమంతా ఎర్రపడ్డది?" అంది.

"నాకు తల పగిలిపోతోంది" అని వాసంతి కిందికి దిగిపోయింది.

"రాత్రింబగళ్ళు రోగికి సేవ చెయ్యటం మాటలా?" అని వినయుడి తల్లి అనటంకూడా ఆమె విన్నది.

* * *

తల్లి పిలిచినా మూడో అంతస్తుకు పోను; అథవా పోయినా అతనికి లొంగినట్టుగా కనిపించను—అని నిశ్చయించుకుంది. తలనొప్పి వంకతో రెండురోజులు మంచం మీదినుంచి లేవలేదు. తల్లీ వాళ్ళ సంభాషణమాత్రం మధ్య మధ్య చెవులు రిక్కించి వినేది. వినయుణ్ని గురించి తెలుసుకోవాలని అప్పుడప్పుడు ఆమెకు చాలా కుతూహలమూ ఆతృతా కలిగేది. కాని తెలుసుకోవాలంటే ఆమెకు అంతకన్న మరో మార్గంలేదు.

ఎందుకనో రెండు రోజులనుంచీ వినయుడు కూడా వాసంతి సంగతే ఆలోచిస్తున్నాడు. ఆనాడు హఠాత్తుగా గదిలోంచి వెళ్ళిపోవటం పోవటం ఆమె మళ్ళీ అతని గదిలోకి రాలేదు. తను అడిగిన ప్రశ్న తప్పుకిందికి వస్తుందా రాదా అని అతను ఎన్నోవిధాల ఆలోచించి చూశాడు. వాసంతి సంగతి జ్ఞాపకం రావటానికి మరో కారణం కూడా వుంది. ఇప్పటి వాసంతి ఆకారం వినయుడికి అయిష్టమైంది కాదు. కొంతకాలంనుంచీ ఆమె విషాద వదనమే అతనికి కన్పిస్తూంది. పైగా ఆనాటి సేవ కూడా అతని హృదయాన్ని తేనెతో తడిపింది. ఆ సేవలోని ఆంతర్యాన్ని అతను గ్రహించాడు. అలాటి సేవ తిరిగి పొందాలనే ఆశతో మెట్లమీద చప్పుడైతే చాలు—అతను కళ్లు

మూసేవాడు. తను నిద్రపోతున్నట్టు తెలిస్తే వాసంతి గదిలోకి వస్తుందని అతని నమ్మకం. కాని ఆమె రాలేదు. సోమో, ఎవరో వచ్చేవాళ్ళు. అప్పుడప్పుడు వాసంతి విషయం సోమూను అడగాలనుకొనేవాడు. కాని ఏదో గొంతు పట్టుకున్నట్టుండేది! వెనక ఎప్పుడూ ఇలాగుండేది కాదు. వాసంతిని గురించి నిర్వికారంగా సోమూతో చర్చించేవాడు.

మధ్యాహ్నం. వినయుడు పండుకున్నాడు. దక్షిణపుగాలి మూసిన కిటికీలకు తగిలి సన్ననిధ్వనితో తిరిగిపోతోంది. తలవైపు కిటికీకి ఒక చెక్క మాత్రం తెరిచి వుంది. దాంట్లోనుంచి రోడ్డుమీది చిటికేశ్వరపు చెట్టుపూలు కన్పిస్తున్నాయి. తెరిచిన కవితాగ్రంథంమీద దృష్టినిలిపి నొసట ఒక చెయ్యీ గుండెమీద ఒక చెయ్యీ వుంచి వినయుడు ఆలోచిస్తున్నాడు. ఇంతలో సోమూ వచ్చి, "నిద్రపోతున్నావా బాబయ్యా?" అన్నాడు.

"ఊహుఁ. ఎందుకూ?" అన్నాడు కళ్ళు తెరిచి.

"నువ్వేమన్నా కేకలేశావేమోనని; కనుక్కోమన్నారు—అమ్మగారు."

"కేకలా! ఎవర్ని?"

"అమ్మణ్ణిని"—వినయుడి తల్లికీ ఇంటావిడకూ వున్న సంబంధం తెలిసినప్పటినుంచీ సోమూ వాసంతిని 'అమ్మణ్ణి' అని పిలుస్తున్నాడు.

"ఏంటోయ్ నాకేం అర్థం కావటంలేదు. స్పష్టంగా చెప్పు" అన్నాడు వినయుడు ఆశ్చర్యంతో.

"స్పష్టంగానా? నేను అమ్మణ్ణిదగ్గరకు డబ్బుకోసం పోయాను. అమ్మగారి డబ్బంతా అమ్మణ్ణిదగ్గరేగా వుండేది; చూస్తినికదా అమ్మణ్ణి టేబిలుమీద తలపెట్టి ఏడుస్తున్నది. ఈసంగతి పోయి అమ్మగారికి చెప్తే ఆమె నన్ను చాటుకు పిలిచి 'సోమూ! మీ బాబయ్య ఏమన్నా కోప్పడి వుంటాడనుకొంటా. రెండు రోజులనుంచీ పైకికూడా పోవటంలేదు. పోయి సంగతేమిటో కనుక్కురా' అన్నది".

తల్లి ఇలా అనుమాన పడ్డదని తెలిసేటప్పటికి వినయుడికి ఎంతో సిగ్గేసింది. చాలాసేపు మెదలకుండా వూరుకొని "నేనేమీ అనలేదని అమ్మతో చెప్పు. ఆఁ,—" అని కాసేపాగి మళ్ళీ అన్నాడు: "ఒకమాటు

పిల్లను పిల్చుకు రాలేవా—సోమూ? ఎవరికీ తెలియకూడదు—చాటుగా. తెలిసిందా?"

"ఓ! ఇప్పుడు పూర్వం మాదిరిగా ఆమె కదవరావటం లేదు. మెత్త పడి పోయింది—అదిగో దానిలాగ" అని పడుకున్న 'జో' వైపు చూపి గదిలోనుంచి వెళ్ళిపోయాడు.

వాసంతి ద్రాక్షకాయలు బుట్టలో పెడుతున్నది. తల్లీ వాళ్ళు అక్కడే ఉన్నారు. సోమూ కిందికి దిగొచ్చి, కాసేపు వారేమన్నా అడుగుతారేమోనని ఎదురుచూశాడు. ఎవ్వరూ పలకరించలేదు. వాసంతీ అక్కడి నించి లేవలేదు. అప్పుడు సోమూ, "బాబయ్యగారు నిన్నొక్కసారి పైకి పిలుస్తున్నారు అమ్మణ్ణిగారూ!" అన్నాడు.

వాసంతి ముఖం కందగడ్డలాగయింది. వినయుడి తల్లి తల వంచుకొని మందహాసం చేసింది. వాసంతి లేవకపోవటం చూసి సోమూ మళ్ళీ అన్నాడు: "ఇప్పుడే!"

వెళ్ళకపోతే తన తగువుసంగతి బైటపడుతుంది. అయినా సిగ్గువల్ల వాసంతి కాళ్ళు కదలటం లేదు. వినయుడి తల్లి వాసంతిస్థితి కొంత గ్రహించి, "కోపాలు పెట్టుకోవచ్చా తల్లీ? లే—పోయి రెండు ద్రాక్షకాయలు ఇచ్చిరా" అంది.

వాసంతికి లేవక తప్పిందికాదు. ఆమె వెళ్ళిపోగానే స్నేహితురాలి వైపు తిరిగి వినయుడి తల్లి అంది—"నీకు నే నప్పుడే చెప్పలా—తలనొప్పి అబద్ధం; అదంతా వేషం; ఇద్దరూ పోట్లాడుకొని ఉంటారని—ఏంరా సోమూ?"

బాబయ్య చాటుగా చెయ్యమన్నదాన్ని ఇలా బట్ట బయలుగాచేసి, కిళ్ళీకొట్టుదగ్గరకు పోతున్న సోమూ యీ ప్రశ్నవిని, "ఆఁ. అదే!" అని జవాబు చెప్పి వెళ్ళిపోయాడు.

* * *

వాసంతిని పిలిపించటానికి ముఖ్యకారణం ఒకటి వుంది. జబ్బు నయమై నప్పటినించీ వినయుడి హృదయం చాలా తేలికైంది.—తల్లిని చూడటం,

సోమూ అనుకోని విధంగా తిరిగి రావటం, అతని హృదయాన్ని ఇంకా మధుసిక్తం చేసింది. అతని యీ పరిపూర్ణానందంలో వాసంతి మధ్య మధ్య అడ్డువస్తూ వుంటున్నది. ఈ అడ్డంకిని తొలిగించుకొనేందుకు ఒకటే మార్గం వుంది. వాసంతితో హృదయం విప్పి మాట్లాడటం. కాని ఎంత ప్రయత్నించినా అతను ఆపని చెయ్యలేకుండా ఉన్నాడు. ఈ ఆటంకాన్ని తొలగించుకొనేందుకే—ఇవ్వాళ వాసంతికి కబురుచేసి పిలిపించింది. కాని సోమూ వెళ్ళిపోయినప్పటినుంచీ అతన్ని రకరకాల ఆలోచనలూ చుట్టుముట్టాయి. సంధి ప్రస్తావన ఎలా తేవాలి? ఎలాటి భాష ఉపయోగించాలి? అనేది అతను నిర్ణయించలేక పోయాడు.

ఈస్థితిలో వాకిటిదగ్గర చప్పుడు విని చప్పున కళ్ళు మూశాడు. ఇలాటి చిక్కునించి తప్పుకొనేందుకు అతనికి చేతనైంది ఇదొక్కటే. అప్పుడప్పుడు చేదుమందునుంచి తప్పించుకోటానికి తల్లి అడుగుల చప్పుడు వినపడ్డా కళ్ళు మూసుకునేవాడు.

వాసంతి వాకిట్లో నిలబడి వుంది. లోపలికి రావాలంటే ఆమెకు కాలు లేవటం లేదు. వినయుడు పిలిస్తే ఆమె లోపలికి వెళ్దామనుకుంది. కాని లోపల ఆ లక్షణాలేమీ కనిపించటం లేదు. కింద వరండాలో కూర్చున్న వినయుడి తల్లితో రెండు మూడు సార్లు ఆమె చూపులు కలిసినై. ఇక విధిలేక ఆమె గదిలో ప్రవేశించింది.

వినయుడింకా ఒక నిర్ణయానికి రాలేదు. ఎలా మాట్లాడాలో అతనికి తోచటం లేదు. మనసులో మాత్రం తీవ్రప్రయత్నం చేస్తున్నాడు. ఇటు కిటికీ దగ్గర వాసంతి నేల చూపులు చూస్తూ నిలబడిపోయింది. ఒక్కొక్క క్షణం ఆమెకు ఒక్కొక్క యుగంలాగ తోస్తున్నది. ఆఖరికి ఉండలేక వినయుడివైపు చూద్దామని తల ఎత్తింది..............వినయుడు ముఖాన చేతులుంచుకొని వేళ్ళ సందునుంచి తన్ను చూస్తున్నాడని గ్రహించింది. అతని వాలకం చూసేవరకు వాసంతికి నవ్వాగలేదు. నోటికి గుడ్డ అడ్డం పెట్టుకొని నవ్వింది. వినయుడు కూడా నవ్వటం చూసి ఇంకా నవ్వింది. ఇంతకాలంనుంచీ జరుగుతూన్న మిథ్యాద్వంద్వం — అస్తంతేలి

విరోధం—హృదయంలో దాగుడుమూతలు ఈ సహజ హాసస్రోతస్సులో కొట్టుకుపోయినై. కాసేపటికి వాసంతి బలవంతాన నవ్వాపుకొని, గంభీరురాలై, "ఇవిగో ద్రాక్షకాయలు, ఇక్కడున్నై. నేను కిందికి పోతున్నాను" అంది.

వాసంతి మిథ్యాగాంభీర్యం వినయుడికి కౌతుకం కలిగించింది. "వెళ్లితే ఇవి అక్కడే వుంటై" అన్నాడు.

ఇక విధిలేక ద్రాక్షకాయలు తీసుకొని వినయుడి దగ్గరకు పోయింది. అతను ఏమనుకున్నాడో కాని ఠక్కున చెయ్యి పట్టుకున్నాడు. వాసంతి సిగ్గుతో క్రుంగిపోయింది. కాని చెయ్యి వదిలించుకోనేందుకు ప్రయత్నించలేదు. వినయుడే సిగ్గుపడి వాసంతి చేతిని వదిలాడు. వాసంతి బయలుదేరింది. కాని ఎక్కడినించో తనకు తెలియని విపరీత సాహసం ఆమెకి కలిగింది. వెళ్ళబోతూన్న వాసంతిని పిలిచి "పొరపాటు జరిగింది. ఇక్కణ్ణించీ మనం పోట్లాడుకోవద్దు" అన్నాడు.

వాసంతి వినయుడి మీద ఒక చల్లని చూపు పారేసి వెళ్లిపోయింది.

కింద స్నేహితురాళ్ళిద్దరూ, కూర్చొని మూడో అంతస్తులో లీలను, ప్రపంచజ్ఞానంలేని జీవుల నవ్వును సంతోషంతో వింటున్నారు. కారణం వినయుడి జబ్బు నయమవటంతో పాటు యీ రెండుకుటుంబాలకూ చుట్టరికంగూడా స్థిరపడ్డది. వాళ్ళిద్దరూ మెట్లు దిగి వస్తూవున్న వాసంతివైపు చూశారు. వాసంతి తప్పుపని చేసినదానిలాగా అడుగులు వేస్తూ తన గదిలోకి వెళ్ళిపోయింది.

వాసంతి గదిలోకి పోయి ఏడ్చింది. కాని ఈమాటు ఓడిపోయాననే దుఃఖంతో కాదు. గెల్చాననే ఆనందంతో! రోజూ ఈ హృదయంలో జరుగుతూన్న సంగ్రామంలో జయించాననే ఆనందంతో! తన కన్నీ రెండే వరకు ఆమె మనస్సు శరత్కాలంలో జోరున వర్షం కురిసి వెలిసిన ఆకాశంలాగా, శుభ్రంగా ఉన్నదని ఆమె గ్రహించింది.

---

# మెల్ల

పదహారేళ్ళనాటి సంగతి. కాలేజీ హాస్టల్, 48-వ నంబరు గది. రాత్రంతా నాటకం చూసి వచ్చి ఉదయం ఎర్రటి కళ్లతో లేవగానే, నరహరికి ఒక కవరు కనపడింది. చించి చదువుకుని "హుర్రే!"అని కేక వేశాను. పక్కగదిలో నోట్సు వల్లిస్తున్న దిగంబరుడు పరుగెత్తుకుంటూ వచ్చి "ఏమిటోయ్ వ్యవహారం?" అన్నాడు.

"శుభవార్తోయ్, శుభవార్త! ఇల్లాలు—"

"అయితే విందున్నదన్నమాట! అబ్బాయేనా?"

"అబ్బాయి కాదోయ్, అమ్మాయి! అయినా విందు చేస్తాను. నాకు కొడుకైనా ఒకటే కూతురైనా ఒకటే—మిశ్రా!" అని వంటవాణ్ణి కేక వేశాడు.

మిశ్ర వచ్చి పద్దు తీసుకుని హోటలుకు వెళ్ళాడు. అర్ధగంట అయినాక హాస్టల్లో ఉన్నవాళ్ళంతా నవజాత శిశువును దీవించి తాంబూలం నములుతూ వెళ్ళిపోయారు. అప్పుడు నరహరి ఇంకోమాటు ఉత్తరం సావకాశంగా చదువుకున్నాడు.—"అమ్మాయి రంగు ఎరుపు; కాని కన్ను కొంచెం మెల్ల."

నరహరి స్త్రీవిద్యాపక్షపాతి. అలాంటి ఒక సంఘంలో సభ్యుడుకూడా. ఈ వార్త అతన్ని ఏమీ నిరుత్సాహ పరచలేదు. పైగా నవ్వి — "అయితే యేం! గుణాలతో అన్నీ కప్పబడతై. చదువు సంధ్యలూ, ఆటపాటలూ నేర్పకుర్రదాన్ని—" అనుకుంటూ లేచి, బజారుకు పోయి వాద్యసామగ్రి అమ్మే షాపులో సితారు ధర ఎంతో కనుక్కువచ్చాడు.

*　　　*　　　*

నరహరి ఆశయాలు రెండు. ఒకటి స్త్రీవిద్యా ప్రచారం: రెండోది వ్యక్తిగతం—బి. యల్. ప్యాసయి హైకోర్టులో ప్రాక్టీసు పెట్టటం. కాని విధి విడంబనవల్ల మూడుసార్లు బి. యే. తప్పి స్వగ్రామంలోని మిడిల్ స్కూల్లో

మాష్టరుగా చేరాడు. తనకు వచ్చే ముప్పయి రూపాయల జీతంలో కూడా నాలుగోవంతు కుమార్తె విద్యకోసం ప్రత్యేకించాడు—కాని, ఆదర్శభ్రష్టుడు మాత్రం కాలేదు. ముందు రంగురంగుల బొమ్మల పుస్తకాలూ, తర్వాత బొమ్మలు గీసే సామగ్రి, ఆపైని సితారూ-అన్నీ కుమార్తెకు సమకూర్చాడు.

"ఎందు కా మనుష్య మశానం దానికి ? అంతకంటే—" అన్నది భార్య విసుక్కుంటూ.

"ఆ సంగతి నాకూ తెలుసు !" అన్నాడు నరహరి మధ్యనే. భార్య ఇకేమీ మాట్లాడలేదు.

పన్నెండేళ్ళ వీణ, సితారు వాయించేది; నరహరి కళ్లు మూసుకుని తన్మయుడై వినేవాడు. వంటయింట్లో కూర తరుగుతున్న భార్య కుమార్తె భవిష్యత్తు తలుచుకుని కంపించేది. ఇలా అనుకుంటూ ఉండగానే వీణకు పదమూడో ఏడు వచ్చింది. భార్య ఇక ఓరిమి వహించలేకపోయింది. ఆమె మేనమామలు పండితులు. వాళ్ల వాసన ఈ మెక్కూడా అబ్బింది; ఒకనాడు నరహరితో స్పష్టంగా "ఇకనన్నా అమ్మాయిని విరగడచేసే ప్రయత్నం చేయండి. నేను బతికుండగానే పెద్దలు నరకంలో కుళ్లటమా !"అని అనేసింది.

"చూస్తాను !" అన్నాడు నరహరి క్లుప్తంగా; ఏమాత్రం ఆదుర్దా కనపరచ లేదు. కాని ఇల్లాలు అంతటితో తృప్తిపడలేదు. సతపోరి, భర్తచేత సెలవు పెట్టించి వరుణ్ణి వెతకటానికి పంపించింది. నరహరి తిరిగి తిరిగి పదిహేడుగురు కుర్రవాళ్ళ ఊర్లూ, పేర్లూ, గోత్రాలూ, వాళ్ళు అడిగిన కట్నాలూ లిష్టు రాసి తెచ్చాడు. అదే భార్యముందు వేసి, "నీ ఇష్టమొచ్చినట్టు చేసుకో !" అన్నాడు.

ఇల్లాలు పిల్లను చూడటానికి తేదీలు నిర్ణయించి అందరికీ ఉత్తరాలు రాసింది. మంగళపురం భట్టాచార్యులవారి తరఫున కుర్రవాడి మేనమామ వచ్చి పిల్లను బాగా ప్రశంసించి, భోంచేసి, ఇంటికెళ్లినాక ఆడవాళ్లను కనుక్కొని ఉత్తరం రాస్తానని చక్కా వెళ్ళాడు. శివపురంనుంచి కూడా వచ్చి పిల్లను చూసిపోయారు; గట్టిమాటేమీ చెప్పలేదు. తాళపురంనుంచి చౌధరిగారి అబ్బాయి మిత్రుల్ని వెంటపెట్టుకుని పిల్లనుచూసిపోవటానికి స్వయంగా

వచ్చాడు; సితారు వాద్యం విని 'వహ్వా' అని మెల్లగా అన్నాడుకూడా. నరహరి కుర్రవాణ్ణి చాటుకు పిల్చి 'అయితే—'అన్నాడు నచ్చుకొంటూ. కుర్రవాడు చాలా మెత్తనివాడు. తలవంచుకుని, "చిత్తం, నేనువెళ్ళగానే మా అమ్మచేత రాయిస్తాను" అన్నాడు.

ఈవిధంగా నరహరి కొంతకాలం భార్య పోరునుంచి తప్పించుకున్నాడు. ఇటు భార్య కొన్నాళ్ళపాటు సమాధానాలకోసం వేచిఉండి, కాబోయే వియ్యంకుళ్ళకు ఉత్తరాలు రాయడం ప్రారంభించింది. నెమ్మదిగా జవాబులు కూడా రాసాగినై. మంగళపురం కుర్రవాడి తండ్రికి జబ్బుగా ఉన్నదట. శివపురం కుర్రవాడికి పరీక్షలట. ఇలాంటివే కారణాలు. తాళపురం నుంచి వచ్చిన ఉత్తరం కొంచెం స్పష్టంగా ఉన్నది. "పిల్లది మెల్లకన్నట. కుర్రవాడు చేసుకోటానికి ఇష్టపడలేదు," అని తల్లి రాసింది.

ఉత్తరం చూసేవరకు ఇల్లాలికి పిచ్చిఎక్కింది. కాయితం చేత పట్టుకుని రంయమని నరహరి దగ్గరికి—కుమార్తె సితారు వాయిస్తూ ఉంటే వింటూ కూర్చున్నచోటికి—వచ్చి, కాయితం కళ్ళదగ్గర పెట్టి "సరిపోయిందా? గుణాలతో అన్నీ కమ్మడతాయంటిరే! చూసుకోండి!" అని కూతురి వేపుకు తిరిగి "నీ చక్కదనానికి తోడు పాటకూడానా? పోయి నీళ్ళులేని భావిలో పడి చావు" అన్నది. వీణ సితారు కిందపెట్టి మాట్లాడకుండా వెళ్ళిపోయింది.

ఆతర్వాత తల్లితండ్రులేమి మాట్లాడుకొన్నారో వీణ వినలేదు. కాని ఆపగలంతా తల్లి వాగుతూనే ఉన్నది: "ఆహా, ఏమి సోయగం! ఏమి కన్ను! పుచ్చపిత్తు ఎందుకు పనికివస్తుంది దానిముందు!"

మధ్యాహ్నం తల్లి నిద్రపోయేటప్పుడు వీణ అద్దం తీసుకు కూర్చున్నది. ఇన్నాళ్ళనుంచీ కంటపడలేదు కానీ, ఇవ్వాళ చూసుకుంటే తనకే సిగ్గేసింది—కుడికన్ను చాలా మెల్ల. అద్దాన్ని అనేక విధాలుగా మార్చి చూసుకున్నది. ఏవిధంగా పెట్టి చూసుకున్నా ముఖం అందంగా కనపడలేదు. అద్దం అవతల పారవేసి చేతులతో ముఖం కప్పుకు కూర్చొబడింది.

ఆనాటినుంచే వీణప్రాయం సత్వరన పెరిగిపోసాగింది. తండ్రి స్కూలునించి

వచ్చి పిలిచినప్పుడు మంచినీళ్లు తెచ్చి ఇచ్చిందే కాని, ముఖం వంక చూడలేక పోయింది. నరహరి కుమార్తెలో మార్పు గమనించాడు. కాని ఏమీ మాట్లాడలేదు. ఇలా తల్లి పితృదేవతలను నరకంవేపుకు ఇంకా కొంచెం మొగ్గించి వీణ ఇంకా రెండు సంవత్సరాలు గడిపింది.

ఈమధ్య వీణ స్వభావంలో చాలా మార్పు కనిపించింది. తలవంచుకుని మాట్లాడడం ప్రారంభించింది. అంతకూ ఎత్తవలసివస్తే, కుడికన్ను దానంతటదే మూతపడేది! నరహరికి తీరిక లేదు—శని ఆదివారాలలోకూడా, భార్య పోరుపడలేక వరుణ్ణి వెతకటానికి పోయేవాడు. కుమార్తె సితారు వాద్యం వింటానికి కూడా ధైర్యం లేదు; సితారు ఝుంకారంతోపాటు భార్య హుంకారం వినపడేది! వీణ సితారు పాకవేసి పారిపొయ్యేది. ఎక్కడనుంచన్నా సంబంధం వచ్చి తిరిగిపోయిన రోజున ఇక వీణ అవమానం చెప్ప శక్యంకాదు. ఆమె కంటిని పుచ్చివిత్తుతో మొదలుపెట్టి ప్రపంచంలో ఉన్న కోలవస్తువులన్నిటితోనూ తల్లి పోల్చేది; ఏదోవిధంగా ఈ పీడ వదలితే పితృదేవతలకు నరకం తప్పుతుందని తేల్చేది.

ఆవాళ తల్లి మండిపోతూ ఉన్నది. ఉదయాన వచ్చిన సంబంధంవారు అమ్మాయి మాకు నచ్చలేదని స్పష్టంగా చెప్పిపోయారు. కారణం మెల్లకన్నే! వీణకు మామూలు తిట్లు తప్పలేదు. పాపం! అన్నంకూడా తినకుండా మంచం కుక్కలో పడుకుంది. నరహరి స్కూలునుంచి వచ్చి గదిలో కూర్చుని హుక్కా తాగుతున్నాడు. ఇంట్లో భార్య అక్కడి కెక్కడికీ విజృంభిస్తూంది. ఇలాంటి సమయంలో ఒక కుర్రవాడు వచ్చాడు. అతన్ని చూడగానే ఇల్లాలు ఒక్కమాటుగా గొంతు తగ్గించి, "రా నాయనా, ఇలా రా! ఎన్నాళ్లయింది నిన్ను చూసి, బాగా ఉన్నావా?" అన్నది.

ఆగంతుకుడు ఆమె పాదధూళి తీసుకుని, "ఏదో ఒకలా ఉన్నాను, అత్తయ్యా! మీరంతా క్షేమమేనా? మాస్టరుగారేరీ?" అన్నాడు.

నరహరి గొంతు గుర్తుపట్టాడు: "ఎవరు? సుకుమారుడా! రావోయ్, ఇటురా. ఎండాకాలపు సెలవల్లోకూడా రాలేదేమా అని అనుకుంటున్నాను—పట్నం వెళ్లి మమ్మల్ని మరిచిపోయావేమిటి?"

సుకుమారుడు క్రాపు సవరించుకుంటూ, "[illegible] మాష్టరుగారూ ! మీరు చూపిన ఆదరమూ, ప్రేమా మరచిపోతగ్గవేనా ? వీణ ఏదీ ? కులాసాగా ఉందా ?" అని అడిగాడు.

నరహరి పిలవకముందే వీణ నెమ్మదిగా వచ్చి సుకుమారునికి నమస్కరించింది. నరహరి కుమార్తెకు అన్ని విషయాల్లోనూ శిక్షణ ఇచ్చాడని సుకుమారునికి తెలుసు. కుశలప్రశ్న లయినాక "ఇప్పుడు ఏమి నేర్చుకుంటున్నావు, వీణా ?" అని అడిగాడు.

"సితారు—"

"దౌర్భాగ్యదేశం ! ఇంటింటా నీవంటి వీణలు జన్మిస్తే—" అన్నాడు సుకుమారుడు ఉత్సాహితుడై.

ఈ పొగడ్త వీణని ఎక్కడికో తీసుకుపోయింది. పగలంతా తిట్లు తిన్న వీణకు ఈ మాటలు ఎంతో శాంతిని కలిగించినవి. కళ్ళల్లో నీరుకూడా తిరిగింది. ముఖం తిప్పుకుని వెళ్ళిపోయింది. తర్వాత సుకుమారుడు అవీ ఇవీ మాట్లాడి వెళ్ళబోయేముందు వీణ నుద్దేశించి, "రేపు మధ్యాహ్నం వచ్చి సితారు వింటా"నని చెప్పి పోయాడు.

* * *

సుకుమారునిది పొరుగు గ్రామం. భాగ్యవంతుల బిడ్డ. ఈ ఊరు మిడిల్ స్కూల్లో చదివేటప్పుడు రోజూ నరహరియింటికి వస్తూ ఉండేవాడు. ఇక్కడ చదువు పూర్తి చేసుకొని కలకత్తా వెళ్ళి ఇప్పటికి ఐదు సంవత్సరాలైంది. ఎప్పుడన్నా ఇంటికి వచ్చినప్పుడు నరహరిని చూచిపోతూఉండేవాడు.

నిరుడు ఎండాకాలపు సెలవల్లో ఇంటికి రాలేదు. ఇతనూ, ఇంకా కొంత మంది మిత్రులూ కలిసి 'జాగ్రత యౌవన సమితి' అనే సంఘాన్ని స్థాపించారు. అందుచేత ఆ పనిలోనే మగ్నమయ్యాడు. ఇప్పుడు స్వగ్రామంలో దానికి బ్రాంచి నెలకొల్పాలని వచ్చాడు.

చెప్పిన ప్రకారం సుకుమారుడు మర్నాడు టంచనగా వచ్చాడు. వాళ్ళ సంఘానికి సంబంధించిన ప్రచారసాహిత్యం కూడా కొంత పట్టుకువచ్చాడు.

సుకుమారుడు కూర్చోగానే నరహరి తన గొడవ చెప్పసాగాడు. అందులో ముఖ్య విషయం వీణ వివాహమని వేరే చెప్పనక్కర్లేదు. వివాహం సంగతి కూతురి ప్రశంసా విని తల్లి వీరిదగ్గరకు వచ్చి—"రూపమే గుణాల నన్నిటినీ మింగివేసింది! నాయనా, నువ్వు కలకత్తాలో ఉంటావు కదా. ఎవరైనా నుగ్రవా డుంటే దీన్ని దాటవేసే మార్గం చూడకూడదూ!" అన్నది.

"అదేమిటి, అత్తయ్యా! ఎవడైనా ఎలా పనికొస్తాడు? మీరు తొందర పడకండి. నేను యోగ్యుణ్ణి చూస్తాను" అన్నాడు సుకుమారుడు.

"దానికి యోగ్యుడు ముల్లోకాల్లోనూ పుట్టలేదు. దేవకన్యక కాదూ—" అంటూ ఇల్లాలు వెళ్ళిపోయింది.

"విన్నావుగా! ఈమాటలకే పిల్ల సగం ఐపోయింది! సిగ్గుతో ఎవరి ఎదటకు రావటంలేదు. నువు కాస్త పిలిచి—"

"అలాగే, వీణ ఏదీ?" అన్నాడు సుకుమారుడు.

నరహరి పిలిచాడు. వీణ గదిలో కూర్చుని పిలుపుకోసమే ఎదురు చూస్తున్నది. మెల్లగా వచ్చింది. నరహరి "సుకుమారుడికి సితారట వినిపించు" అన్నాడు.

వాద్యం విని సుకుమారుడు ఆశ్చర్యపోయి "ఎవరు నేర్పావు, వీణా?" అన్నాడు.

"స్వంతంగానే నేర్చుకున్నాను" అన్నది వీణ తలవంచే.

"మాస్టర్ని పెట్టడానికి డబ్బెక్కడిది నాయనా? లేకపోతే అమ్మాయికి ఇంగ్లీషు సంస్కృతాలతోబాటు భారతదేశంలోని ముఖ్య భాష లన్నీ ఒక్కొక్కటే నేర్పించా లనుకున్నాను. సామెత ఉండనే ఉందిగా, బుద్ధులు భూమిలేలితే రాత గాడిదలు కాస్తుందని" అన్నాడు నరహరి.

"నేను వాద్యంవిని ఆశ్చర్యపోయాను మామయ్యగారూ! తగిన శిక్షణవుంటే వీణ ఏమయ్యేదో!" అన్నాడు సుకుమారుడు.

ఈమాట విని వీణ చదువుకునే గదిలోకి వెళ్ళిపోయింది. సుకుమారుడు ఓరకంటితో ఒకమాటు వీణను చూసి 'ఈ దౌర్భాగ్యదేశానికి ముక్తి కలగా లంటే వీణవంటి స్త్రీలు ఎంత అవసరమో.' రసవత్తర భావాలలో ఆవేశంతో

ఉపన్యసించాడు. నరహరి సుకుమారుని తల చేతితో స్పృశించి "నూరేళ్లు బతికి దేశానికి కీర్తి, తే, నాయనా!" అని ఆశీర్వదించాడు.

గదిలో ఉండి వీణ ఈ మాటలన్నీ విన్నది. ఆమెను ఏవో నూతన ప్రపంచం ఆహ్వానిస్తున్నట్టుగా తోచింది. మనస్సు ఆనందంతోనూ, భరవాసాతోనూ సజీవమైంది.

స్వదేశ విదేశాల్లో స్త్రీఉద్యమం ఎలాఉన్నదో వీణకు చెప్పమని నరహరి సుకుమారుని కోరాడు. సుకుమారుడు ప్రతిరోజూ వచ్చి వాళ్ళ సమితి ఉద్దేశాలూ, స్త్రీ పురుషుల హక్కులూ మొదలైన జటిలసమస్యలను తీసుకుని మహోత్సాహంగా విమర్శించి వీణలోని అంతశ్శక్తిని మేల్కొలుప ప్రయత్నించేవాడు! వీణకు అంతా అర్థమయ్యేది కాదు; అర్థంకాకపోయినా, ఆ మాటలు ఆమెకు బాగానే ఉండేవి. సుకుమారుని మాటలు ఆమె మీద నిషావస్తువులాగా పనిచేయసాగినయి. ఒకనాడు అతను రావటం కొంచెం ఆలస్యమైంది—వీణకు ఏమీ తోచలేదు. ఇంతలో సుకుమారుడు వచ్చాడు. "ఇవ్వాళ్ళింత ఆలస్యమైందేమీ ?" అని అడిగింది వీణ. ఈ మాటలోని అభిమానం సుకుమారుడు గ్రహించి వీణ గడ్డం పట్టుకుని "నేను రాకపోతే నీకు కష్టంగా ఉంటుందా, వీణా ?" అన్నాడు.

"ఆఁ" అన్నది వీణ తల ఎత్తకుండానే.

సుకుమారుడు మందహాసం చేసి చేతులు రెండూ వీణ భుజాలమీద వేసి "రేపటినుంచి ఆలస్యం చేయనులే. కాని నువు నన్ను 'మీరు' అని పిలుస్తావెందుకు ? 'నీవు' అని పిలువు" అన్నాడు.

"అమ్మో, నావల్ల కాదండీ, సిగ్గేస్తుంది" అన్నది వీణ. కాని వీణసిగ్గు ఎక్కువసేపు నిలవలేదు. సుకుమారుడు ఆ వేళే 'నీవు' అనిపించి వదిలాడు. ఆనాటినుంచే సుకుమారుడు తనవాడేనట్టుగా వీణ భావించసాగింది. అంతే కాదు, సుకుమారుడు తనచేయి పట్టుకుని ఏవో దేశం తీసుకుపోతున్నట్టు కల కూడా కన్నది. క్రమంగా సెలవలు వెళ్లిపోయినయి. సుకుమారుడు సెలవు తీసుకోవచ్చేవరకు వీణ ఏడుస్తున్నది.

"ఎందుకు, ఏడుస్తావు వీణా ?"

"నువ్వు వెళ్ళిపోతున్నావుగా!" అన్నది వీణ మెల్లగా.

"క్రిస్టమస్ సెలవలకు తప్పక వస్తాను. ఏడవకు!" అని జేబురుమాలతో వీణ కళ్లుతుడిచాడు. వీణ కాస్సేపు మాట్లాడలేదు. తర్వాత సుకుమారుని కుడిచేయి రెండుచేతులతో పట్టుకుని—"నన్ను అసహ్యించుకోరు కదూ?" అన్నది.

"ఎందుకు అసహ్యించుకుంటాను వీణా! నువ్వేమి చేశావు?" అన్నాడు ఆశ్చర్యంతో.

వీణ తలవంచుకుంది. కాసేపు మాట్లాడలేదు. "నాది మెల్లకన్ను కాదూ? నన్ను—" అన్నది నవ్వి ఏడుస్తూ. సుకుమారుని ముఖంమీద కౌతుకహాసం తాండవమాడింది. వీణ గడ్డం పట్టుకుని ముఖం పైకెత్తి—"అందుకనే నువ్వింత బాగా ఉంటావు, వీణా!" అన్నాడు.

ఈ మాటకు వీణముఖం కూడా వికసించింది. లేచి నమస్కరించింది.

వెళ్ళేటప్పుడు ఇల్లాలు సుకుమారునికి వరుణ్ణి చూడమని పదేపదే చెప్పింది. నరహరి సుకుమారుని ఎదటే, "నీ కెందుకంత ఆదుర్దా! మాట ఇచ్చిన తర్వాత సుకుమారుడు తప్పుతాడా? వాడి కసాధ్య మేమీ లేదు" అన్నాడు.

* * *

సుకుమారుడు వెళ్ళిపోయినప్పటి నుంచీ వీణ కొక వ్యక్తిత్వం ఏర్పడింది. ఇంతకుపూర్వం తల్లి తిడుతూంటే తండ్రితో చెప్పేది. ఇప్పుడు వినిపించుకోనట్టు గదిలోకి పోయి తలుపు వేసుకుంటున్నది. ఎదురు లేకపోతే తల్లికి పోట్లాడాలంటే మాటలు దొరకవు; ఎప్పుడూ ఏదో ఒకటి వాగుతూ ఉండకపోతే ఆమెకు తలనెప్పి. అందుకనే, వీణ ఉదాసీనత ఆమె కేమీ బాగుండలేదు. ఒకనాడు నరహరితో—"చూచారా? అమ్మాయిలో ఇంకో మంచి గుణం పెరిగింది. ఇదివరకు మెల్లకన్నే, ఇప్పుడు మూగ కూడా! ఎంత తిట్టినా ఎదురు చెప్పదు!" అన్నది.

నరహరి కూడా వీణలోని ఈ క్రొత్త మార్పును గమనించాడు. కారణం

కూడా కొంతవరకు ఊహించుకున్నాడు. పైగా కుమార్తె దాంపత్య జీవితాన్ని మనసులో చిత్రించుకుని పులకితుడు కూడా అయాడు. భార్య ఫిర్యాదు విని అతను మందహాసం చేసి—"అమ్మాయి పెద్దదయింది. ఇక దాని అందాన్ని ఎత్తిపాడవబోకు. నీకు మంచిఅల్లుడు దొరికే యోగముందిలే !" అన్నాడు.

భార్యమీద ఈ మాట బాగా పనిచేసింది-"అయితే మీనోట పంచదారే !" అన్నది.

నరహరికి ఆశ్చర్యమేసింది. గత మూడు సంవత్సరాలనుంచీ భార్యనోట ఇటువంటి మాట అతను వినలేదు; సంతోషంతో హుక్కా పీల్చటం మొదలుపెట్టాడు.

సుకుమారుడు వెళ్ళేటప్పుడు తన అడ్రసు రాసి కొన్ని కవర్లు వీణకు ఇచ్చిపోయాడు. వారానికి రెండు ఉత్తరాల చొప్పున రాయమని కూడా ఆదేశించాడు. వీణ తలుపు బిగించి సుకుమారునికి ఉత్తరం రాయటానికి కూర్చున్నది. ఒక పూటల్లా శ్రమపడి ఉత్తరం పూర్తిచేసి పోస్టుకు పంపించినాక ఆమె మనస్సు కుదుటపడింది.

* * *

టేబిలుమీద అద్దం పెట్టుకుని సుకుమారుడు ముఖానికి, 'స్నో' రాసుకుంటున్నాడు. ఇంకో కుర్చీమీద వాళ్ళ సమితి వైస్‌ప్రెసిడెంటు నృపేన్ దత్తు కూర్చుని డిక్షనరీ వాయిస్తూ, జావళీ పాడుతున్నాడు. దర్వాను ఉత్తరం తెచ్చి ఇచ్చాడు. నృపేను కవరుమీద అడ్రసు చూసి—'ఏమోయ్, అడ్రసు నువ్వు రాసిందిలాగా ఉంది' అన్నాడు. ఉత్తరం ఎవరిదో సుకుమారుడు ఊహించుకున్నాడు. అందుకనే స్నోబాటిల్ టేబిలుమీద పెట్టి ఉత్తరంకోసం చేయి చాచాడు.

"ముందు ఎవరిదో చెప్పందీ నేను ఉత్తరం ఇవ్వను !" అన్నాడు నృపేన్.

"ముందు చదవనివ్వు, తర్వాత చెప్తాను."

వీణ రాసిందని వేరే చెప్పడ మెందుకు ! ఉత్తరం పెద్దది. సుకుమారుడు

ఒక్కొబిగ్గున ఉత్తరం పూర్తిచేసి ముఖానికి స్నో రాసుకుంటూ "ఒకమాటు బిగ్గరగా చదవవోయ్, న్నపేన్! నేనూ వింటాను" అన్నాడు. న్నపేన్ చదవసాగాడు:

"మీరు వెళ్ళిపోయినప్పటినుంచీ, నాకేమీ బాగా ఉండటం లేదు. చదవాలనే కోరికలేదు. మీరు కోప్పడతారనే బలవంతాన పుస్తకం ముందు వేసుకుంటున్నాను.

"మీరు వెళ్ళినదోవవంకే నేను కిటికీలోనుంచి చూస్తూ ఉంటాను. త్వరగా రండి. లేకపోతే చదివినకాస్తా మరిచిపోతాను."

ఈమాటలే పెంచి వీణ ఐదుపేజీల ఉత్తరం రాసింది.

"ఎవరోయ్ ఈవిడ? మాంచి ఉచ్చులు వేశావే!" అన్నాడు న్నపేన్ ఉత్తరం చదివి.

సుకుమారుడు తువాలుతో ముఖం తుడుచుకుంటూ "తర్వాత చెప్తానులే. ఉత్తరమిలా పడవేయి, చప్పున జవాబు రాసి పారవేస్తాను" అన్నాడు.

"కాస్త పరిణామంకూడా ఆలోచించు!" అని న్నపేన్ సుకుమారుని వీపుచరిచి వెళ్ళాడు.

ఉత్తరం పోస్టుచేసినప్పటినుంచీ వీణ తను అనుకున్నదల్లా ఉత్తరంలో రాయలేకపోయాననే అని దిగులుపడింది. సుకుమారుడు జవాబిస్తాడో లేదో ననికూడా భయపడింది. కాని జవాబు సకాలంలోనే అందింది. వీణ తలుపు బిగించి గదిలోకూర్చుని చదవ నారంభించింది. దానిలో వాక్యాలు వివాహ మహోత్సవంనాటి సన్నాయి స్వరంలాగా ఆమె చెవిలో గింగురుమనసాగినవి.

ఉత్తరంలో అనేక సంగతు లున్నవి. ప్రతి సాయంత్రమూ సుకుమారుని మనస్సు ఉదాసీనంగా ఉంటుందట; చదవటానికి పుస్తకం తెరిస్తే ఎవరివో కళ్ళు అక్షరాలకు బదులు కనపడేవట; తను పూలుకుట్టి ఇచ్చిన రుమాలు నిరవంగా జేబులో గానంచేస్తూ ఉంటుందట!—ఇంకా యిలాంటివే చాలా ప్రాణాంతకమైన మాటలతో సుకుమారుడు ఉత్తరాన్నంతా నింపేశాడు. చివర కొన్ని ఉపదేశాలుకూడా ఉండేవి. వీణ, సాయంత్రం, ఉత్తరం పెట్టెలో పెట్టబోయేముందు దానిమీద కాసేపు తలపెట్టి "మీరు నేను

సౌభాగ్యరాలనయ్యేటట్టు ఆశీర్వదించ"మని సుకుమారు నుద్దేశించి ప్రార్థించింది.

నరహరి ఆవేళ అన్నమాట ఇంకా భార్యమనస్సులో ఉన్నది; అందుకే నే ఇప్పటివరకు భర్తదగ్గర పెళ్ళివిషయం మళ్ళీ తేలేదు. అందుచేత కుమార్తె సంగీతసాధనా, తండ్రి ధూమపానమూ నిరభ్యంతరంగా సాగుతూ వున్నవి. ఆనాడు ఎందుచేతో ఆమె ఈ ప్రసంగం హఠాత్తుగా తెచ్చింది. సుకుమారుడు వీణకు ఉత్తరాలు రాస్తున్న సంగతి నరహరికి తెలుసు. అన్నాడు:

"సుకుమారుడు చూస్తానని చెప్పి పోయాడుగా! అప్పుడే—"

భార్య నమ్మనిధోరణిలో "ఆఁ! ఇంకా ఆతని మాటలు జ్ఞాపకమున్నై? ధనవంతుల బిడ్డ - మనబోటివాళ్ళ సంగతి ఎందుకు పట్టుతుంది?" అన్నది.

వీణ తలుపుచాటునే ఉన్నది. తల్లిమాటలు విని మందహాసం చేసింది.

నరహరి కళ్ళజోడు తుడుస్తూ "ఒకసెల ఆగరాదూ, సెలవల్లో వస్తాడాయె! ఆతనితోనే మాట్లాడుదువుగాని అన్నీ" అని జోడు తగిలించి హుక్కాగొట్టం అందుకున్నాడు.

సుకుమారుడు వస్తే మాట్లాడతాడనే నమ్మకం ఆమెకూ ఉన్నది. కొద్ది రోజుల్లోనే వస్తాడని తెలిసేవరకు ఆమె తృప్తిపడి వెళ్ళిపోయింది.

వీణ మందులకంపెనీవారి కాలెండర్ ఒకటి సంపాదించి క్రిస్టమస్ ఎప్పుడో చూస్తూ కూర్చుండేది. దినాలు యుగాలుగా గడుస్తున్నవి. ఎలాగైతే ఏం, క్రిస్టమస్ వచ్చింది. సుకుమారుడుకూడా వచ్చాడు. సాయంత్రం ఇద్దరూ కలుసుకొన్నారు. వీణ సుకుమారుని హృదయంమీద తలపెట్టి—
"నేను కలకత్తా వచ్చి దగ్గరుంటానని నాన్నతో చెప్పా. మిమ్మల్ని చూడందే నేనుండలేను" అన్నది.

"మీ తండ్రి ఇష్టపడకపోతే?"

"నన్ను బలాత్కారంగా తీసుకెళ్ళండి."

సుకుమారుడు ముఖం చాటుచేసి నవ్వుకుని "ముందు వాళ్ళను మాట్లాడనివ్వు, తర్వాత కనుక్కోవచ్చు" అన్నాడు.

భార్య రోజూ సుకుమారుని కనుక్కోవాలనుకొనేది కుమార్తె వివాహ విషయం. కాని వీలు చిక్కటంలేదు. పైగా నరహరి భార్యతో సుకుమా

రుడు తనకై తాను తన వివాహం సంగతి ఎత్తనిది, ఏమీ అడగవద్దని చెప్పాడు. ఇన్నాళ్ళపాటు ఈమె ప్రాణాలన్నీ ఒడ్డి భర్త ఆదేశాన్ని పాలిస్తూ వచ్చింది. కాని సుకుమారుడు కలకత్తా వెళ్ళేముందు ఈమె దగ్గరకు సెలవు తీసుకోటానికి వచ్చినప్పుడు ఇక ఓరిమి వహించలేకపోయింది. సుకుమారుడు మళ్ళీ ఎప్పుడొచ్చేదీ అడిగి వివాహ ప్రసంగం తెచ్చింది.

“అంత తొందరేం వొచ్చింది అత్తయ్యా! ముందు చదువుకోనివ్వు” అన్నాడు సుకుమారుడు.

“తొందరేమిటి నాయనా! నా పెళ్ళి ఎనిమిదోఏటే”

ఈ చరిత్ర సుకుమారుడు చాలాసార్లు విని ఉన్నాడు. ఈ వివాహ వివరాలు ఘంటలోపుగా పూర్తి కావనికూడా అతనికి తెలుసు. అందుకని మధ్యనే అడ్డ “కుర్రవాణ్ణి ఒక విధంగా మాట్లాడే అట్టిపెట్టాను. మీరేమీ గాభరాపడకండే. పరీక్షలు కాగానే లగ్నం పెట్టుకోవచ్చు” అంటూ తలవాకిట్లోకి వచ్చేశాడు. ఆమె ఇంట్లోవుండే అన్నది:

“పరీక్షలు గిరీక్షలు ఎందుకు నాయనా! ఎలాంటివాడైనా ఫరవాలేదు—”

సుకుమారుడు వెళ్తూనే—“ఎలాంటివాడికైనా పారవేయ దలుచుకుంటే నాకే ఇవ్వండి, అత్తయ్యా,” అని పోయాడు.

సుకుమారుడు ఈ మాటలు ఏదో ఖయ్యాలీలో అని పోయాడు. తానన్నదేమిటో మళ్ళీ దోవను పోతూకూడా ఆలోచించుకోలేదు. కాని ఇవి ఈ కుటుంబాన్ని ఒక్కమాటుగా ఊపి వదలినవి. భార్య గబగబ వంట ఇంట్లోకి పోయి, పొయ్యిమీదకూర దించి, చేతులో తెడ్డున్న సంగతికూడా మరిచిపోయి రయిన నరహరిదగ్గరికివచ్చి—“ఏమండీ, సుమారుడు ఏమనిపోయాడూ?” అని అడిగింది.

నరహరి చప్పన జవాబివ్వలేకపోయాడు. అతని గొంతు పట్టుకుపోయింది. ఒకటి రెండుసార్లు దగ్గి గొంతు సవరించుకుని అన్నాడు: “విన్నావుగా! నే విన్నా—”

భార్య నరహరి బుగ్గమీద తెడ్డుతో పొడిచి—“చెప్పండి, వింటాను! నా గుండెల్లో ఎలానో ఉన్నది” అన్నది లాలనగా.

"పిల్లను అంతగా పారవేయదలచుకుంటే నాకే ఇవ్వమన్నాడు—ఇక సరా! పోయి కాసిని మంచినీళ్లు తే. గొంతు పట్టుకుపోయింది" అన్నాడు నరహరి. భార్య నవ్వుకుంటూ వెళ్లిపోయింది.

సుకుమారుని మాటలు వీణ కేమీ ఆశ్చర్యం కలిగించలేదు. భగవంతుని దృష్టిలో తను సుకుమారుని భార్యగాని అతనినోటే వీణ అనేకసార్లు విన్నది. ఇప్పుడు ఆమాటే సుకుమారుడు అందరి ఎదటా చెప్పివేయడంచేత ఆమె సిగ్గుతో తలమునకలైంది. ఆ రాత్రి ఎవ్వరి ఎదుటకూ రాలేదు. భోజనానికి పిలిచినా లేవలేదు.

"ఊరుకో, ఇక దాన్ని పిలవకు! సిగ్గుపడింది" అన్నాడు నరహరి.

ఆ రాత్రే భార్యాభర్తలు మెల్లగా పరామర్శించుకున్నారు. ఫలితం, మంచిరోజు చూసి నరహరి సుకుమారుని ఇంటికి పోయాడు. కాస్సేపు లోకాభిరామాయణం మాట్లాడుకున్నాక కొడుకు వివాహ విషయం రాగానే బ్రజదులాల్ బాబు—"వాడి పెళ్లివిషయంలో నాకేమీ జోక్యం లేదు. ఈ కాలపు పిల్లల్ని తమ రెరుగుదురు గదా!" అన్నాడు.

ఈ మాట నరహరికి ఇంకా ప్రోత్సాహం కలిగించింది. కుమార్తెను ఒక మాటువచ్చి చూచి పొమ్మని సుకుమారుని తండ్రిని వినయంగా ఆహ్వానించాడు. బ్రజబాబు ఏమీ తేల్చి చెప్పలేదు; ఊరుకొన్నాడు.

నరహరి వెళ్ళిపోయిన తర్వాత బ్రజబాబు అంతఃపురములోకి పోయి, భార్యతో సంగతంతా చెప్పాడు. ఆమె ఒక్కమాటుగా గుడ్లు విప్పుకుని—"ఏమిటీ? నరహరి మాష్టరుతోనా వియ్యం!" అన్నది. ఆ తర్వాత ఆమె నోట మాటరాలేదు. బ్రజబాబు ప్రపంచానుభవం కలవాడు. నరహరి కుటుంబంతో సుకుమారునికి స్నేహమున్న సంగతి అతనికి తెలుసును. ఆ సంగతి భార్యకుకూడా చెప్పాడు. ఆమె పిల్లను చూడటానికి పోవద్దనలేదుకాని, ఆ వేళంతా ముఖం మాడ్చుకున్నది.

వీణ మనస్సునంతా లగ్నంచేసి సుకుమారునికి ఉత్తరం రాస్తున్నది. తల్లి వచ్చి—"రాతకూతలు కాస్సేపు ఆపి, పోయి సబ్బు రుద్దుకొని స్నానం చేయి. ఇవ్వాళే నిన్ను చూడటానికి వస్తారు" అన్నది.

కొన్నాళ్ళనుంచి వీణ తల్లితో నిర్భయంగా మాట్లాడుతున్నది. రాసిన కాయితం బోర్లవేసి—"ఇదివరకు నన్నెవరూ చూచిపోలేదేమిటి? ఇవ్వాళ కొత్తగా వస్తారా!" అన్నది.

ఈ మాటల్లో విసుగు ఎక్కువైనదో తల్లి గ్రహించింది. వీణ చేయిపట్టుకుని బలవంతంగా లేవదీసి "ఇవ్వాళ ఒక్కనాడే. ఇక నిన్నెప్పుడూ అడగనులే తల్లీ! తండ్రికూడా ఇష్టపడాలిగా!" అన్నది.

వీణ గొణుక్కుంటూ లేచిపోయింది.

బయట వ్రజ దులాల్ బాబు సుకుమారుని మేనమామతోపాటు కూర్చుని హుక్కా తాగుతున్నారు. వీణ నెమ్మదిగా వచ్చి ఇద్దరికీ నమస్కరించింది. ఇంతకుముందు ఎవరి ఎదుటకూ రావటానికి ఆ పిల్ల ఇంతె భయపడలేదు. వీరికి నచ్చనేమోననే భయం ఆమెకు ఎక్కువకాసాగింది. సుకుమారుని తండ్రి తనవంక తీక్ష్ణంగా చూస్తూ ఉండటంకూడా కనిపెట్టి కుడికంటి నల్లగుడ్డును మధ్యకు తీసుకురావాలని చాలా ప్రయత్నించి ఉక్కిరిబిక్కిరైంది. ఆమె ముఖమంతా ఎర్రబడింది.

వ్రజదులాల్ బాబు వీణ అవస్థ కనిపెట్టి ఏమీ అడగకుండానే ఆశీర్వదించి పంపివేశాడు. వీణ వెళ్ళిపోయిన తర్వాత సరహాదికీ సుకుమారుని మేనమామకూ సంభాషణ జరిగింది. దాంట్లో తేలిన సారాంశమిది—"వారేదో లాంఛనంగా పిల్లను చూడటానికి వచ్చారేగాని అసలు కుర్రవాడి ఇష్టప్రకారమే వివాహం జరుగుతుందట." గోడచాటున నిలబడి వింటున్న వీణకు భారం తగ్గినట్లయింది. ఆ వేళ అర్ధరాత్రిదాకా కూర్చుని ఉత్తరం పూర్తిచేసింది. సుకుమారుని తండ్రి వచ్చి చూచిపోయిన సంగతి రాయటంకూడా మరచిపోలేదు.

ఆ వేళ సుకుమారునికి బొత్తిగా తీరిక లేదు. సాయంత్రం వాళ్ళ సమితి మీటింగు ఉన్నది. అందులో ఉపన్యసించాలి; అదే రాసుకుంటున్నాడు. నృపేన్ స్టవ్ వెలిగిస్తున్నాడు. ఇంతలో టపావచ్చింది. సుకుమారుడు ముందు వీణవుత్తరం చించి చదివాడు. అంతా వెనకటిపాటే; అదే బాగా వుండకపోవటం; రాత్రింబవళ్లు ఏదో గుబులుగా ఉండటం; ప్రతిసాయంత్రం

కళ్లవెంట నీళ్లు కారటం. సుకుమారుడు కాయితాలన్నీ తిప్పాడు. చివర ఈమాటలు ఉన్నవి. "మామగారువచ్చి చూసిపోయారు. వారి అభిప్రాయమే తన అభిప్రాయమునికూడా చెప్పారు."

ఈ ఉత్తరం అవతల పారేసి తల్లిరాసిన ఉత్తరం చదవగానే అతని బుర్ర చెడిపోయింది. నరహరి వచ్చి కూతుర్ని చూడమని తండ్రిని బతిమాలటం; పిల్లనుచూసిన వివరాలూ ఉన్నవి ఆ ఉత్తరంలో. మూడోవుత్తరం నరహరిది. సుకుమారుని మాటనమ్మి వ్రజబాలుకు పిల్లను చూపించాననీ, చదువుకు ఆటంకం లేకుండావుంటే వచ్చేమాసంలోనే వివాహంచేయాలని వున్నదనీ, అతని జవాబుకోసం ఎదురుచూస్తున్నాననీ వున్నవి. ఇది చదివేవరకు సుకుమారునికి సంగతి కెర్రెత్తింది. "నాన్‌సెన్స్!" అని చీత్కారంచేశాడు.

స్వాపేన్ చేతిలోని ఆమ్లెట్ ప్లేటు కిందపడింది. "సంగతేమిటోయ్?" అని అడిగాడు.

సుకుమారుడు ఇంగ్లీషులో తిట్టుకుంటూ వుత్తరాలన్నీ చుట్టి స్వాపేన్ మీద పారేశాడు. స్వాపేన్ వుత్తరాలు సావకాశంగా చదివి అన్నాడు: "ఇంత దూరం వచ్చినాక —"

"పెళ్ళి చేసుకోమంటావా!" అన్నాడు సుకుమారుడు. మండిపడుతూ.

"తప్పక! లేకపోతే ఈబురద పూసుకోటం ఎందుకు?" అన్నాడు స్వాపేన్ మందహాసం చేస్తూ.

"తప్పెవరిది? మిడతవచ్చి నిప్పులో పడితే తప్పు నిప్పుదా? బాగా చెప్పావు! ఇప్పుడే నా తరఫున అమ్మకు వుత్తరం రాసెయ్ — నేను చెప్తూ తాను ఏమి రాసేదీ."

"అంతకంటే ఇంకోపని చేయవోయి! పాము చావకుండా బడితె విరగకుండా ఒకవుత్తరం రాసి కొన్నాళ్ళు పాటు ముఖం తప్పించు. పాప మా పిల్ల క్రమంగా మరిచిపోతుంది!"

"నీకు తెలియదోయ్ దానిసంగతి. తండ్రిని వెంటపెట్టుకొని రేపే వచ్చి పడుతుంది. ఊటిముండ! ఇక నలుగురిలో తలెత్తటానికి వీలేనా! అంతకంటే, ఒక్కసారే తెగతెంపులు చేసుకుంటే బాగా ఉంటుంది. పాము

ముండ ! ఇవ్వాళ మీటింగుకూడా ధ్వంసం చేసింది!" అంటూ సుకుమారుడు డ్రాయరులోంచి కాయితాలు తీశాడు.

నృపేన్, సుకుమారుని తల్లికి తన పేరుతో ఉత్తరం రాశాడు, కాని అందులో మాటలన్నీ సుకుమారునివే. "ఇప్పుడు సుకుమారుడు పెళ్ళి చేసుకోదలచుకోలేదు. చదువుకు చాలా ఆటంకమని వాడి నమ్మకం. అసలు నరహరి కుమార్తెను వాడు ఎప్పుడూ చేసుకోడు. కారణం, ఆపిల్లది మెల్ల కన్ను." ఈ చివర వాక్యం నృపేన్ చేత బలవంతంగా రాయించి ఉత్తరం స్వంతంగా పోస్టు చేసి సుకుమారుడు "బతికాను, బాబూ!" అని నిట్టూర్చాడు.

నృపేన్ రాసిన ఉత్తరం చదివి సుకుమారుని తల్లి వ్రజబాబుతో— "చూశారా, నాకడుపున కొరగానివాడు పుట్టలేదు! పంపండి ఈ ఉత్తరం నరహరి మాస్టరికి" అన్నది గర్వంగా.

"ఛీ! అట్లా చేయవచ్చా? అంతకంటే అబ్బాయి ఇప్పుడు పెళ్ళిచేసుకోనన్నాడని ఎవరిచేతనైనా కబురుచేయి!" అన్నాడు వ్రజబాబు.

"అట్లయితే వాళ్ళంతాకలిసి అబ్బాయిని పీడిస్తారు!" అని ఆమె వెళ్ళి పోయింది. మర్నాడే దాసీచేత నరహరిఇంటికి పంపించింది నృపేన్ రాసిన ఉత్తరం.

వీణ సుకుమారుని కోసం బాలీసు కవరుమీద పూలు కుడుతున్నది. ఇంతలో తల్లి ఏడుపునని పరుగెత్తుకొచ్చింది. తల్లి తల నేలకు వేసి కొట్టుకుంటూ 'రాత'ను తిట్టుతున్నది. తండ్రి వాడిపోయిన ముఖంతో స్తంభానికి ఆనుకుని కూర్చున్నాడు. దాసీది కొయ్యలాగా ఏదో కాయితం పట్టుకు నుంచున్నది. సుకుమారునికి ఏదో అమంగళం జరిగి ఉంటుందని ఊహించి వీణ తల్లిని కావలించుకుని—"ఏమిటమ్మా?" అన్నది శంకతో.

తల్లి వీణను దూరంగా పడనెట్టి—"నా ఎదటునించి పో, దౌర్భాగ్యురాలా! ఇంకా ముఖం చూపిస్తున్నావా? పోయి ఆ ఉత్తరం చదువుకో!" అన్నది.

వీణ దాసిచేతిలోనుంచి ఉత్తరం తీసుకొని వెళ్ళిపోయింది.

రెండు ఝాములైనా వీణ ఉత్తరం చేతపట్టుకుని కొయ్యబొమ్మలాగా

కూర్చున్నది. ఏమిజరిగిందో కూడా ఆమె ఆలోచించుకోలేకుండా ఉన్నది! గత నాలుగుమాసాలనుంచీ జరిగిన అభినయమంతా ఆమె తలపుకు రాసాగింది. సుకుమారుడన్న మాటలన్నీ ఆమె చెవిలో ప్రతిధ్వనించినవి. "మెల్ల ఉండబట్టే నువ్వింత బాగా ఉంటావు!" అన్నమాట ముఖ్యంగా బాధ చేస్తున్నది. సుకుమారుడు ఆమెల్లనే ఇవ్వాళ ఆక్షేపించాడు! వీణదృష్టి హఠాత్తుగా సుకుమారుని ఫోటోమీద పడింది. ఆమె మళ్ళీ ఆలోచనలో పడింది. "సుకుమారుని సైతన్ను రెండుసార్లు బజారికి తీసుకొచ్చినవే, తనకు అందవికారంగా కనుపించలేదేమి? అలా ఉండటమే అందమేమో అని తోచిందేమి? ఇక తన మెల్లకన్ను సుకుమారునికి వికారంగా ఎందుకు కనిపించింది?"

"లే, అయినసింగారం చాలు! పొద్దుకూడా తిరిగింది, రెండు మెతుకులు ఎంగిలిపడు!" అంటూ తల్లి గదిలోనికివచ్చి వీణనుచూసి స్తబ్ధురాలయింది. తర్వాత కుమార్తెను వాటేసుకుని ఏడవసాగింది. వీణ తల్లిహృదయంలో తల పెట్టింది.

సాయంత్రం నరహరి స్కూలునుంచివచ్చి వీణను పిలిచాడు. సమాధానం రాలేదు. తర్వాత భోజనానికి తల్లి పిలిచింది. కాని తలనొప్పిగా ఉన్నదని వంకపెట్టి పడుకున్నది.

"ఇవ్వాళ ఇక దాన్ని పిలవబోకు" అన్నాడు నరహరి.

రాత్రి రెండుగంటలయినా కూడా వీణ సుకుమారుడు రాసిన ఉత్తరాలు చదువుతూ వుంది. తర్వాత అన్నీ మడిచి, సుకుమారుని ఫోటోకు చూపిస్తూ— "ఇవన్నీ మిథ్యేనా? నా కంటి మెల్లేనా సత్యం!" అన్నది.

'మెల్ల' అంటే తలుచుకోగానే ఆమె మనస్సు దేవినట్టయింది. ఈ కంటికీ శరీరానికీ ఏమీ సంబంధం లేనట్టుగా ఆమెకు తోచసాగింది. ఈ ఆలోచనతోనే ఆమె టేబిలుమీదవున్న చాకు తీసుకున్నది.

* * *

ఆర్తనాదం విని నరహరీ, అతనివెంట భార్యా పరుగెత్తుకుంటూ వచ్చారు. వీణ ముఖమంతా రక్తకొల్లు. చాకు పిడివరకూ కంట్లో దిగబడి ఉంది.

వరకు తీసుకువచ్చింది. ఉదయం మరమరాలు వేయించటం, మధ్యాహ్నం రూపగ్రామం వెళ్ళి వాటిని అమ్మి సాయంత్రం యింటికి రావటం; వంటా భోజనం అయిన తర్వాత జమీందారుగారి వృద్ధ దాసి లక్ష్మిని శ్రోతగా కూర్చుండబెట్టి రామాయణమో, భారతమో చదవటం. ఇదీ ఈమె దినచర్య. ఈవిధంగానే చంప దినాలు గడిచిపోతున్నవి.

శ్రావణమాసపు మేఘాలు ఆనాటి మధ్యాహ్నాన్ని సాయంత్రం చేసి వేసినై. చంప త్వరత్వరగా మరమరాలు అమ్ముకొని ఇంటికి వచ్చేసింది. ఇంటి ముంగిలిలోని వేపచెట్టు ఉన్న కాస్త వెలుతుర్ని కూడా ఇంట్లోకి పోనివ్వకుండా చేసింది. ఆమె పంచపాళీలో అడుగుపెట్టగానే, ఎవరో అక్కడ పడుకొని ఉండటం చంప చూసింది. ఆ చీకటిలో గుర్తుపట్టే ఉపాయమేమీ లేదు. చంప "ఎవరు?" అని ప్రశ్నించింది. జవాబు రాక పోయేసరికి బుట్ట క్రింద పెట్టి ఇంట్లోకి పోయి దీపం వెలిగించి తీసుకు వచ్చింది.

పడుకున్నతన్ని చంప యిదివర కెప్పుడూ చూడలేదు. ఇరవై, ఇరవై రెండేళ్ళు ఉంటాయి అతనికి. కళ్ళు మూసుకుని పడుకొని ఉన్నాడు. చంప అతని దగ్గరకి వచ్చి మళ్ళీ ప్రశ్నించగానే యువకుడు కళ్ళు తెరిచి—"నీరు" అన్నాడు.

"నువ్వెవరవు? ఎందు కిలా పడుకొన్నావు?" అని చంప ప్రశ్నించింది.

"నీరు! దప్పిక!" యువకుడిక ఏమీ జవాబు చెప్పలేదు—

ఆగంతకుడు రోగి అని చంప గ్రహించింది. గ్లాసుతో నీళ్ళు తీసుకువచ్చి త్రాగించి, ఒంటిమీద చేయి పెట్టి చూసింది. శరీరం పెనంలాగ వేగిపోతూ ఉంది.—"నువ్వెవరవు? ఎట్లా వచ్చావిక్కడికి?" అన్నది మళ్ళీ.

యువకుడు చెప్పినదానికి సారమిది—అతని పేరు వసంతం. మహీపల్లి వెళ్ళుతూ జ్వరం ఎక్కువ కావటం చాత ఇక్కడకు వచ్చి పడుకున్నాడు. జ్వరం తగ్గిపోగానే వెళ్ళిపోతాడట.

మహీపల్లి రూపగ్రామానికి రెండు క్రోసుల దూరం ఉంటుంది. అతని చుట్టాలు ఎవరన్నా అక్కడ ఉన్నారేమో కబురు చేయవచ్చునని ఉద్దే

శంతో చంప "అక్కడ మీవాళ్ళెవరున్నారు?" అని ప్రశ్నించింది.

"ఎవరూ లేరు, దేవాలయం చూడబోతున్నా."

చంప కొంచెం విసుగ్గా అన్నది—"అలాగా! మరి నిన్ను ఇక్కడ ఎవరు చూస్తారు? ఎక్కడనుంచి వచ్చావేం?"

"ఎవ్వరూ చూడ నక్కర్లేదు. జ్వరం తగ్గగానే నాతోవను నేను పోతాను. ఇక నువ్వు వెళ్ళిపోవచ్చు."

ఆ స్వరంలో కొంచెం తీవ్రత ఉన్నదని చంప గ్రహించింది. ఇక ఆమె ఏమీ అడగలేదు. తల దగ్గర గ్లాసుతో నీళ్ళుపెట్టి "పోతున్నా. దప్పిక అయితే తాగు" అని చంప లోనికి వెళ్ళిపోయింది.

రాత్రి తొమ్మిది గంటలకు చంప ఒకసారి బయటికి వచ్చింది. జ్వరతీవ్రతలో వనమాలి అప్పుడు ఏదో అస్పష్టంగా కలవరిస్తున్నాడు. చంప శ్రమగా దాన్ని గుర్తించింది. ఆమె కేమీ పాలుపోవటంలేదు. ఇటువంటి స్థితిలో వున్న మనిషిని బయట ఉంచవచ్చా? మరి, ఒక అపరిచిత యువకునికి లోపల చోటుమాత్ర మెలా యిస్తుంది? ఆమెమనస్సులో ఈవిధంగా ద్వంద్వం జరుగుతూ ఉండగా లక్ష్మి వచ్చి విషయమంతా విని—"ఇంకా ఏమిచేస్తావు? మధ్యయింటిలో తఖ్తాబల్లమీద పక్క వెయ్యి. పాపం ఎవరిపిల్లవాడో! ఆపదలో ఉన్నప్పుడు ఎక్కడ పారవేస్తా?" అన్నది.

రెండో మార్గంకూడా కనపడలేదు చంపకి. పక్క వేసి, ఇద్దరూ చెరో రెక్క పట్టుకొని వనమాలిని ఇంట్లోకి తీసుకువెళ్ళి పండబెట్టారు. ఆ రాత్రంతా మాడ మీద నీళ్ళుచల్లుతూ, విసనకర్రతో విసరుతూ చంప అలా కన్నుమూసి తెరిచేసరికి బారెడు ప్రొద్దు ఎక్కింది.

ఇక ఆరోజు మం[illegible]లు వేసటం పడలేదు.

* * *

మర్నాడుకూడా జ్వరం అలాగే ఉన్నది. చంప, మొట్టమొదట "ఎందుకు వచ్చిన పీడా యిది" అని కొంచెం అయిష్టతగానే ఉన్నదిగాని మధ్యాహ్నం జ్వరఉద్రేకంలో వనమాలి ఆమె చేయిపట్టుకొని "నీవు నా

కోసం చాలా ప్రయాసపడుతున్నావు కాని నేను బ్రతికేటట్టు లేను." అన్నప్పుడు ఆమె కళ్లల్లో గిర్రున నీరు తిరిగింది. ఒక్క క్షణంలో తను పడే శ్రమా, ఇబ్బందులూ అన్నీ మరచిపోయి, "భయం ఎందుకు ? తప్పకుండా నయమవుతుంది. నీవు నిద్రపో, నేను వైద్యుణ్ణి పిలుచుకొస్తాను" అన్నది.

మూడు గంటల వేళప్పుడు వైద్యుడు వచ్చి, మందిచ్చి పథ్యం చెప్పి, చక్కా వెళ్ళిపోయ్యాడు.

అయిదురోజులు జేరం కట్టిపెట్టి, విసుగూ, విరామం లేకుండా చంప వనమాలికి సేవ చేసింది. వైద్యుడొచ్చి ఇక ఫరవాలేదని చెప్పిపోయిన రోజున చంప ఆనందాశ్రువులు రాల్చింది. వనమాలి ఆమెచేయి పట్టుకొని అడిగాడు: "ఏడుస్తావెందుకు ? నాకు నయమయిందిగా ?"

చంప చేయి వదలించుకొని పథ్యం పట్టుకురావటానికి లోపలికి పోయింది. పథ్యం పెట్టిన తరువాత వనమాలి అన్నాడు: "నీ ఋణం నేను తీర్చుకోలేను. భగవంతుడు—"

చంప మధ్యనే: "ఇప్పుడు నాకు వినటానికి తీరిక లేదు. వారం రోజుల నుంచి జేరం మూలపడ్డది. ఇప్పుడే పోబోతున్నాను. నువ్వు బయటకు పోమాకు. ఇంట్లోనే వుండు. ఈమందు—" అని కాగితంలో పెట్టి వున్న కణిక తీసి చేతికిచ్చి "మధ్యాహ్నం తులసిరసంతో ఆరగదీసి తాగు. నేను స్నానంచేసి తులసి ఆకు యిచ్చిపోతాను" అన్నది.

ఆ వేళల్లా వనమాలి ఏమోమో ఆలోచించాడు. ఈ దరిద్ర స్త్రీ సంపాదన తను ఊరకె కూర్చుని తింటున్నాడు. తను ఈమెకు ఎవరు? ఇలా తింటం న్యాయం కాదు.

సాయంకాలం, చంప, రాగానే "జ్వరం రాలేదుగా?" అని అడిగింది.

రాలేదు అన్నట్టు తల తిప్పి, అన్నాడు—"చూడు, నేను పోవాలను కున్నాను."

చంపముఖం గంభీరమైంది. సంధ్యాంధకారంలో వనమాలి అది కనిపెట్ట లేదు. కాసేపు నిశ్శబ్దంగా ఉండి ఆమె అన్నది: "సరే, వెళ్ళండి! ఈ సంగతి నన్ను అడగటం ఎందుకు ?"

మాటధోరణే అనుమతి సూచకంగా ఉండకపోవటం కనిపెట్టి వనమాలి ఇకేమీ మాట్లాడలేదు. మాపున పాలూ, రొట్టె తీసుకువచ్చినప్పుడుకూడా ఆమె ముఖముమీద నల్లని ఛాయ పోలేదు. వనమాలి ఒక్క గుక్కలో గ్లాసు ఖాళీచేసి అన్నాడు. "ఇదిగో, నీవు పేదదానివి. నన్ను ఇంకా ఎన్నాళ్లు పోషిస్తావు? ఇప్పుడు నాకు బాగా నయమయింది. అందుకనే పోవాలను కుంటున్నాను."

చంప వనమాలి ముఖంవంక చూసింది. అతను పోదగినస్థితిలో ఉన్నాడనేసంగతి ఆమెకుకూడా తెలుసు. కాని ఈ అసహాయుడైన అతిథిమీద ఆమెమనస్సులో ఎక్కడో ఒకమూలను కాస్త మమత కూడుకున్నది. పొమ్మనటానికి ఆమె మనస్సు ఏ మాత్రమూ ఒప్పుకోవటం లేదు. చాలాసేపు ఆలోచించి "రెండుపూటలూ అన్నం తిన మొదలెట్టగానే వెళ్ళిపోవచ్చు" అన్నది.

"సరే" నని వనమాలి పండుకొన్నాడు.

*                *                *

ఆరోజున వనమాలి హఠం వేసుకు కూర్చున్నాడు—మధ్యాహ్నం తనకు అన్నం పెట్టమని. మరీ ఖచ్చితంగా వద్దంటే అతను ఏమిభావిస్తాడో నని చంప సరే నన్నది. కాని ముఖభంగిమ మారిపోయింది. ఆ పూటంతా ఆమె వనమాలితో సరిగా మాట్లాడలేదు. వనమాలి ఇది గ్రహించాడు. కొన్ని దినాల నుంచి విశ్వవకుండా స్త్రీ సంసర్గంలో ఉండటంచాత స్త్రీ చిత్తవృత్తిని గ్రహించే జ్ఞానంకూడా అతనికి కొద్దిగా కలిగింది.

మధ్యాహ్నం చంప పొయ్యి రాజేసి ఎసరు పెటుతూ ఉండగా చంకను జోలి తగిలించుకొని, వైష్ణవు డొకడు వాకిట్లో నిలబడి కరుణాపూరితమైన కంఠంతో—"దోసెడు బియ్యం పెట్టు తల్లీ! వైష్ణవుణ్ణి. ఏకాదశిపూట పారణచేసుకుంటాను" అని యాచించాడు.

ఇవ్వాళ ఏకాదశి అని వినగానే చంప హృదయంలో భారం చాలా తగ్గిపోయింది. వనమాలివైపుకు తిరిగి "ఇవ్వాళ ఏకాదశి అన్న సంగతే మరచిపోయాను" అన్నది.

వనమాలి ఆ పూట అంతా చంప సుఖలక్షణాలు కనిపెడుతూనే ఉన్నాడు. ఈ మాటలో ఉన్న అర్థాన్ని చంప గ్రహించి "అయితే ఇన్నాళ్లే తినను, దించేసేయి" అన్నాడు.

చంపముఖం కళకళలాడుతుంది. "అయితే రేపటి నుంచి కాలుస్తాను. నాల్గోనాడు వేసుకుని తిందువుగాని. ఏమంటావు?" అన్నది.

వనమాలి మంచిపిల్లవానిలాగె "అలాగే" నన్నాడు.

బిచ్చగాడు ఆవాళే చంప ఇంట్లోనుంచి మూడు రోజులకు సరిపోయే గ్రాసం గుంజుకు వెళ్ళాడు.

మరునాడు భోజనం పెట్టమని వనమాలి పట్టుపట్టలేదు. బజారుకు వెళ్ళేటప్పుడు ఒక దస్తా రంగుకాగితాలు తెచ్చి పెట్టమని చంపను, అడిగాడు. ప్రొద్దుపోయాక రంగు కాగితాలు తీసుకొచ్చి వనమాలికిస్తూ చంప: "ఇవ్వాళ అన్నం తింటావా?" అని అడిగింది.

ఈ ప్రశ్నకు జవాబు వనమాలి చాలాసేపటి క్రిందనే స్థిరపరచుకొని ఉంచాడు. "వద్దు. ఇన్నాళ్ళు ఆగినవాణ్ణి ఎలానూ ఆగాను; ప్రాణందాకా ఉంటాను" అన్నాడు.

చంప సంతసించింది.

చంప ఉదయం లేచి చూసేవరకు, ఇంట్లో ఏడెనిమిది కాగితపు పంజరాలూ, వాటిమధ్యను రంగురంగుల పిట్టలూ కనపడినవి. పంజరాల, పక్షుల నిర్మాణకౌశలం చూచి చంపకు ఆశ్చర్యం కలిగింది. ప్రొద్దెక్కి, వనమాలి కళ్ళు నులుముకుంటూ బయటకు వచ్చినప్పుడు, చంప "రాత్రంతా మేల్కొని యీపని చేశావా? మళ్ళీ మంచాన పడితే ఎవరు చేస్తారో చెప్పు?" అన్నది. వనమాలి ఆ ప్రశ్నకేమీ జవాబియ్యకుండా "నువ్వు బజారుకు వెళ్ళేటప్పుడు వీటినికూడా తీసుకు వెళ్లు" అన్నాడు.

"ఏం చేయటానికి?" అని చంప అడిగింది.

"అమ్మకం! పది పన్నెండు అణాలు గిట్టుబాటు అవుతై. ఊరకనే కూర్చుని తింటూ ఉన్నాను."

"అందుకని రాత్రంతా మేలుకొని, రోగం తెచ్చుకొని, నాకు తిండి పెడ

తావా! ఎవరు మోస్తారివి? నేను వొంటరిదాన్ని. మరమరాలే చూస్తానా? పిట్టలే చూస్తానా?"

వనమాలి ఏమీ మాట్లాడలేదు. మధ్యాహ్నం పంజరాలకు దారాలు కట్టుకుని వనమాలి బయటికి పోవటం చంప చూసింది. ఉదయం జరిగిన సంభాషణ అంతా ఆమెకు జ్ఞాపకం వచ్చింది. గబగబా పరుగెత్తుకు పోయి "నువ్వు పోవద్దులే. రెండురోజులు అయిందో లేదో ఎంగిలిపడి మోకాటిలోతు బురదలో బజారుకు పోతావా? ఇలాంటి మనిషిని నేనెక్కడా చూడలేదు! ఇవ్వు యిట్లా, నాచేతికి!" అన్నది.

వనమాలి ఎదురుచెప్పకుండా పంజరాలకు కట్టినదారాలు చంప చేతికి యిస్తూ "చాలా జాగ్రత్తగా తీసుకుపో. పెద్దగాలి కొట్టితే చాలు, చిరిగి పోతై" అన్నాడు.

చంప బుట్ట నెత్తిన పెట్టుకొని చేతితో కాగితపు పంజరాలుపట్టుకొని వెళ్ళి పోయింది. సాయంకాలం చంప నవ్వుతూవచ్చి "ఇదిగో నీ పంజరాలకు వచ్చిన డబ్బు తీసుకో—రెండు రూపాయల ఆరణాలు" అన్నది.

చేతిలో వేసినడబ్బును యిస్తూ వనమాలి "నీవే ఉంచుకో" అన్నాడు.

చంప "నీడబ్బు—" అన్నది.

వనమాలి మధ్యనే అడ్డుతూ—"నువ్వు నన్ను బ్రతికించకపోతే యీ పంజరాలు ఎవరు తయారుచేసేవారు చంపా!" అని నిస్సంకోచంగా ఆడబ్బు చంపకొంగున ముడివేశాడు.

చంప వనమాలివంక ఒకమాటు తేరిపారచూచి వంటయింట్లోకి వెళ్ళింది.

మరునాటినుంచి వనమాలి కాయితాల పువ్వులూ, పిట్టలూ, పంజరాలూ చేయటంలో నిమగ్నుడయాడు. అతనికి అవుసరమయిన సహాయం చంప చేస్తూఉండేది. ఈవిధంగా కొన్నిదినాలు గడిచాయి.

ఒకరోజున వనమాలి అన్నాడు: "ఇంతకంటే ఒక దుకాణం అద్దెకు తీసికోకూడదూ? మరమరాలతోపాటు కాగితపు బొమ్మలుకూడా పెట్టవచ్చును. అలా అయితే నేను పగటిపూట అక్కడే కూర్చుని పనిచేస్తూ ఉంటాను."

చంప ఉత్సాహంతో "నిజమే, చాలా బాగుంటుంది! నీకు అమ్మటం తెలుసా? చాలామంది మోసగిస్తూ ఉంటారు!" అన్నది.

"నువ్వు ధరచెప్పిపో. నేనలాగే అమ్ముతూ ఉంటాను" అని వనమాలి అన్నాడు.

తర్వాత దుకాణంలో ఏమేమి ఉంచాలనే విషయాన్ని చాలా పొద్దుపోయేవరకు సంప్రతించుకొన్నారు. ఆ బజారు ముక్కివెనని మాదిరిగా దుకాణం పెట్టాలని చంపకు చాలా రోజులనించి కోరిక ఉన్నది. తాను ఒంటరికత్తె కావటంచేత తనకోరికను ఇంతకాలం కార్యరూపానికి తీసుకురాలేదు. ఎన్నిదినాలనుంచో ఉన్న కాంక్ష నేడు పూర్తికాబోతున్నదని ఆమెకు చాలా ఉత్సాహం కలిగింది. ఉత్సాహాతిశయంచే ఆమెకు నిద్ర పట్టనుకూడా పట్టలేదు; ఆరాత్రి అంతా ఆలోచించి, ఎన్నిసంవత్సరాలకో తన మరమరాల దుకాణం నవీనుడి పెద్దఅంగడి అంత అవుతుందోకూడా స్థిరపరచుకొంది.

చంప ఒకకొట్టు అద్దెకు తీసుకున్నది. అయిదున్నర అద్దె అనేవరకు మొదట కాస్త సందేహించింది. కాని వనమాలి ధైర్యం చెప్పాడు: "అయిదున్నర అంటే ఒకరోజు సంపాదన పాటా! ఏసరా పండక్కి ఏనుగులూ, నావలూచేసి అమ్మి సంవత్సరం అద్దె ఒక్కరోజులో సంపాయిస్తాను."

చంప మందహాసంతోకూడిన స్నిగ్ధదృక్కులతో వనమాలిని బహూకరించింది.

వనమాలి రంగురంగుల కాగితాలతో కొట్టంతా రెండురోజుల్లో అలంకరించివేశాడు. దుకాణం అలంకరించటం పూర్తి అయ్యాక ఒకనాటి సాయంత్రం చంప తన పొరుగింటి మణివేణిని వెంటబెట్టుకొని దుకాణం చూట్టానికి వచ్చింది. అలంకారం అద్భుతంగా ఉంది. వేలకొలది రంగురంగుల సీతాకోకచిలుకలు ఎక్కడినుంచో ఎగిరివచ్చి కొట్లో వాలినట్టుగా ఉంది. శిల్పిని ప్రశంసిస్తూ మణివేణి చంప చెవిలో "నీది మంచి అదృష్టమే చంపా! జాగ్రత్త, పోగొట్టుకోనేవు!" అన్నది.

చంపముఖం లజ్జచే కందిపోయింది

చంప ఆరోజు ఇంటికి తిరిగివచ్చేవరకు పొద్దుపోయింది. కొట్టుదగ్గరనుంచి సీతారాంతిగారి యింటికిపోయి దుకాణం పెట్టటానికి మంచిరోజు ఎప్పుడో కూడా కనుక్కొని వచ్చింది. పొట్లాలు కట్టటానికి పాత వార్తాపత్రికలు కూడా ఒక వీశెడు తీసుకువచ్చింది.

"ఈ కాగితా లెందుకు చంపా?" అన్నాడు వనమాలి.

"పొట్లాలకు కావద్దూ? అందరూ చెంగులో నే తీసుకుపోతారా ఏమిటి?"

చేయిచాచి వనమాలి "ఇలా యివ్వు. రాత్రికి చించి అట్టే పెడతాను." అన్నాడు.

"పగలంతా పనిచేసి మళ్లీ రాత్రంతా మేలుకొంటావా?" అని చంప ఇంట్లోకి వెళ్ళింది.

భోంచేశాక చంప కాయితాలు చింపటానికి కూర్చుంది. కొట్లోకి కావలసిన యితర సామానులు రేపే కొనాలి. చంప చేతిలో కత్తెర ఆడుతూ ఉన్నది. మనస్సుమాత్రం ఎక్కడెక్కడో విహరిస్తూ ఉన్నది. తన మామూలు దుకాణం మారి పెద్ద మిఠాయిఅంగడి అయింది. దుకాణం ముందు చాలామంది బేరగాళ్లున్నారు. గుమాస్తా బేరం అమ్ముతూ ఉన్నాడు. వనమాలికి చిన్ని బొజ్జకూడా వచ్చింది. ఖాతా పుస్తకాలు ముందు వేసుకొని లెక్కలు చూసుకొంటున్నాడు. తాను పంచసాలోలో కూర్చుని బంగారపు తీగతో చుట్టిన తులసిమాల తీసుకొని జపంచేస్తూ ఉన్నది. ఇలాంటి వింతా ఎన్నో సుఖస్వప్నాలు శరన్మేఘాలవలె ఆమె మనోగగనం మీదుగా ఎగిరి పోతున్నాయి.

హఠాత్తుగా వనమాలిబొమ్మని చూచి చంప చకితురాలయింది. వార్తాపత్రికలో వనమాలి బొమ్మ ఎదురున్నది? చప్పున దీపాన్ని ఇంకా కొంచెం దగ్గరకు లాగి చిత్రంక్రింద రాసిఉన్న నాలుగుపంక్తులూ చదివింది. ఆ మరు నిముషంలో ఎక్కడినుంచో అంధకారపువరద ఒకటి వచ్చి ఆమె సుకాణాన్నీ, ఇంటినీ ఊడ్చుకుపోయింది. ఇక మిగిలింది వనమాలి బొమ్మా, కొన్ని పంక్తుల అక్షరాలూ, చంపా! చంప రెండు చేతులూ హృదయానికి హత్తుకొని నిట్టూర్చి అస్ఫుటంగా "అబ్బ!" అన్నది.

బెంగాలీపత్రికలోని ప్రకటన పేజీలో వనమాలి బొమ్మ, దానిక్రింద ఈ విధంగానూ రాసి ఉంది !

"నా తమ్ముడు శ్రీ వనమాలీ వసు ఆరుమాసాల క్రితం ఇంటినుంచి వెళ్ళిపోయాడు. మాతల్లి అతనికోసం బెంగపెట్టుకొని నిద్రాహారాలు వదలివేసింది. ఆమె బ్రతుకుతుందనే ఆశ లేదు. శ్రీవారు మామూలు కారణానికే అలిగి ఇంటినుంచి వెళ్ళిపోయారు. అతనిజాడ చెప్పినవారికి అయిదువందల రూపాయలు బహుమానమిస్తాము.—శ్రీ కిన్నయలాల్ వసు—బర్ద్వాన్."

తెల్లవారవచ్చినప్పటికీ పత్రికముందు చంప ప్రతిమవలె అలానే కూర్చుని ఉంది. కాకుల అరపులు విన్నాక ఆమెకు పూర్వజ్ఞానం మళ్ళా వచ్చింది. లేచి నిలబడి చాలాసేపు ఏ మాలోచించుకొన్నదో ఆమెకే తెలియాలి. తర్వాత అప్రక్క గ్రామంలో పోస్టుమ్యానుగా ఉన్న తన మేనమామకొడుకు వద్దకు పోయింది.

వనమాలి లేచి ముఖంకడుక్కొని వరండాలో చాపవేసుకుని కూర్చుని వుండగా చంప తిరిగి వచ్చింది. వనమాలి ఆమె ముఖంవంక చూసి "ఏమిటి చంపా! అలా వున్నావు?" అన్నాడు.

చంప పళ్ళతో పెదవి బిగబట్టి "ఏమీ లేదు" అని మరమరాలు అమ్మకు రావాలనే నెపంతో బజారుకు వెళ్ళి సాయంత్రం తిరిగివచ్చింది.

వనమాలి చాలా ఉద్వేగంతో ఆ పగలంతా గడిపి సాయంకాలం వాకిట్లో నిలబడి చంపకోసం ఎదురు చూస్తున్నాడు. చంప కనపడగానే "ఇవ్వాళ పగలంతా నువ్వు కనబడకపోయేసరికి పిచ్చివాడిమల్లే తిరిగాను!" అన్నాడు.

ఆ మాటకు చంపకళ్ళల్లో నీరుతిరిగింది. తన్ను ఏదోవిధంగా సంబాళించుకుని "ఇవ్వాళ రత్నపురం వెళ్ళాను" అని జవాబిచ్చింది.

"అయితే యివ్వాళ పగలంతా ఉపవాసమేగా! చేతులూ, కాళ్ళు కడుక్కో; తిందువుగాని. అన్నం, కూరా మూతపెట్టి ఉంది. నేను ఒక మాటు దుకాణం చూసివస్తాను" అని వనమాలి వెళ్ళిపోయాడు.

చంప కాసేపు పైటపరచుకొని అరుగుమీదనే పడుకొన్నది. తర్వాత తులసికోటదగ్గర దీపం వెలిగించి అన్నం వడ్డించుకు కూర్చున్నది.

వనమాలి తనకోసం అన్నం వండి పోయాడు! . ఇంతకంటె విధి వైపరీత్య మేముంటుంది? ముద్ద నోట్లో పెట్టుకోగానే ఆమెకు ఏడ్పు వచ్చి పొర పోయింది. వెంటనే ఆమె అన్నపుపళ్లెం మూతవేసి లేచింది.

ఇక ఆ పూట భోంచేయలేదు.

ఈ రెండుమూడు రోజులనుంచీ చంప యింత దిగులుగానూ, గంభీరం గానూ ఎందుకు ఉంటుందో వనమాలికి తెలియలేదు. నాలుగోనాడు భోజన మయ్యాక చంపను అడిగాడు: "ఏం? ఇవ్వాళేకదూ దుకాణం తెరిచేది! అంతా నాకు తెలియచెప్పవేం?"

చంప ఏదో చెప్పబోయి ఆగిపోయింది. కొంతసేపు నిశ్శబ్దంగా ఉండి "ఇవ్వాళ కాదులే" అని అన్నది.

"ఎందుకని? దసరా దగ్గరకువచ్చేసింది. ఇప్పటినుంచీ పెట్టకపోతే తీరా ఆ సమయంలో ఏమి చేయగలం? కనీసం దుకాణం ఉన్నదన్న సంగతైనా కొనేవాళ్లకి తెలియాలిగా!"

చంప తులసికోటదగ్గర అలుకుతూ ఉన్నది. హతాశతోకూడిన ఉదాసీన స్వరంతో మెల్లగా "ఇంకా దుకాణమే!" అని అనుకున్నది.

వనమాలికి వినపడలేదు. తిరిగి అలాగే ప్రశ్నించాడు. చంపలేచి "దుకా ణంసంగతి దేవుడికి తెలుసు! నీవిక నన్నేమీ అడగవద్దు" అన్నది.

వనమాలికి ఈమాట ఏమీ అర్థంకాకపోయినా, చంప ముఖంవంక చూడ గానే మళ్ళీ ప్రశ్నించాలనే ఆతురత అతనిలో అంతరించింది.

మధ్యాహ్నం చంప ఇంట్లోకూర్చుని ఏదో కుట్టుకుంటూ ఉన్నది. వన మాలి బయట అరుగుమీద కాళ్ళు వేలాడవేసి కూర్చుని, త్వరగా దుకాణం పెట్టటంవల్ల కలిగే లాభాలనుగురించి ఉదాహరణలిస్తూ అనర్గళంగా వాగు తున్నాడు. ఈ సమయాన బయట వాకిలిదగ్గర ఎవరో కేకవేశారు: "చంపా వైష్ణవి ఇంట్లో ఉన్నదా?"

చంప జవాబివ్వకముందే ఒక నడికారు పెద్దమనిషి ఒక ముసలమ్మను వెంట పెట్టుకొని ఇంటిముంగిలిలోకొచ్చి నిలబడ్డాడు. అకస్మాత్తుగా అన్ననూ, గానినీ మాచి వనమాలి విస్తుపోయాడు. ముసలమ్మ వనమాలిని కాపిలించుకొని

పెద్దపెట్టున ఏడ్చింది. చంప ఏమీ మాట్లాడకుండా బయట అరుగుమీద చాపపరచి పోయింది.

*　　　*　　　*

బయట ఎద్దుబండి నిలబడిఉన్నది. చంప వంటఇంట్లో కూర్చుని వంట చేసుకోవటానికి పొయిమీద ఎసరుపెట్టి పొయ్యిముందు కూర్చుని ఉంది. చాల ఆత్రంతో వనమాలి ఇంట్లో ప్రవేశించి "నేను పోతున్నాను. కాని నా దగ్గర ఎందుకిలా చాతుర్యం చూపించావు? నేనుంటం నీ కిష్టంలేదు గనక నేనే పోతున్నాను!" అన్నాడు.

వనమాలినిచూసి చంపలేచి నమస్కారంచేసి దూరంగాపోయి నిలబడ్డది. వనమాలి ఆరోపించిన నేరానికి ఆమె ఏమీ జవాబు చెప్పలేదు. ఒక్కసారి మాత్రం అతనివంక చూసింది. ఆ సజలనేత్రాలలోని వ్యథను వనమాలి అర్థం చేసుకోలేదు. శ్లేషగా అన్నాడు: "అయిదువందల రూపాయలకు లోభించావనుకుంటా!"—అన్న చేసిన ప్రకటన అతను చూశాడు.

వనమాలిమాటకు చంపకళ్లల్లో అగ్ని జ్వలించింది. ఆమె ఏదో అనబోతూ ఉండగా "చంపా, మా తల్లీ! ఎక్కడ ఉన్నావు?" అంటూ వనమాలితల్లి ఆ యింట్లో ప్రవేశించి చంపను కౌగలించుకొని "నేను వెళ్ళుతున్నాను తల్లీ! ఈ ముసలిది పోగొట్టుకొన్న నిధిని మళ్ళీ నీవు సమర్పించావు! నీకు అక్షయ వైకుంఠం కలుగుతుంది! ఇంకా ఏం చెప్పేది? ఈ ముసలిదాన్ని బ్రతికించావు. ఈ బ్రతికిన నాలుగు దినాలూ నీ పేరుతో నారాయుడికి తులసీ దళం అర్పిస్తాను. ఇవిగో తీసుకో. ప్రపంచంలో అనేక అవసరాలు కలుగుతూ ఉంటవి. దగ్గర ఉంచుకో!" అని అనేక ఆశీర్వాదాలతోపాటు ఒక చిన్న సంచికూడా ఆమెచేతిలోపెట్టి వెళ్ళిపోయింది. చంప రెప్ప వాల్చకుండా సాగిపోతూఉన్న ఎద్దబండివంక చూస్తూ నిలబడింది. ఇంతలో మణి వెవవిడోడుకు మాణిక్యం వచ్చి "అక్కయ్యా!" అని పిలిచాడు.

చంపఇంటికి ఎవరువచ్చారో తెలుసుకురమ్మని మణి అతన్ని పంపింది. మాణిక్యాన్ని చూడగానే చంపకు మళ్ళీ స్పృహవచ్చింది. దీర్ఘ నిశ్వాసం విడిచి "కృష్ణ, కృష్ణ!" అన్నది.

తరువాత వంట ఇంటిలోపలకు పోయి గుప్పిటిలో ఉన్న సంచిని చూచుకొన్నది. తెరిచిచూస్తే వందరూపాయల కాయితాలు అయిదు ఉన్నవి. బహుమతి! వెటకారంతో కూడిన నవ్వు ఆమె ముఖముమీద చిగురించింది.—"కొంచెం ఆగు మాణిక్! బండి ఎంతదూరం పోయిందో చూసి వస్తాను!"

* * *

బండి ఊరుబైటకు పోయేవరకు మాణిక్యం రొప్పుతూ రోస్తూ పరిగెత్తుకు వచ్చి "బండి కాస్త ఆపండి" అని అన్నాడు.

కన్నయ్యలాలు తల బయటకుపెట్టి "ఎవరు?" అన్నాడు.

"నా పేరు మాణిక్యఘోష్. ఇదిగో తీసుకోండి. చంపక్కయ్య మీకివ్వమనిపంపింది" అని ఆసంచి బండిలో పారవేసి అడ్డుదోవను అదృశ్యమయ్యాడు.

వనమాలి "ఏమిటి అన్నాయ్!" అని అడిగాడు.

"ఆ నోట్లేననుకుంటా. మళ్ళీతిప్పి పంపించింది" అన్నాడు, కన్నయ్యలాల్.

ఒక్క క్షణకాలం వనమాలిచక్షువులు విస్మయంతో విస్ఫారితమై మరుక్షణాన్నే జలంతో నిండిపోయినవి.

* * *

చంప నేడుకూడా బుట్ట నెత్తిన పెట్టుకొని మరమరాలు అమ్ముతూ ఉంటుంది. ఆదుకాణంతలుపుమాత్రం తాళంవేసి ఉన్నది. కాని చంప ప్రతి మాసం దానికి అద్దెచెల్లిస్తూ ప్రతి మాపూ దాంట్లో సందెదీపం వెలిగిస్తూ ఉంటుంది. ఎందుకు యిలాచేస్తున్నదోమాత్రం ఎవ్వరూ చెప్పలేకుండా ఉన్నారు.



# పరాయి అబ్బాయి

వృద్ధ శంభుసర్కారు స్వగ్రామమైన 'ఝూఝూడాంగా'లో గత ముప్ఫయి సంవత్సరాల నుంచీ బడి చెప్పుకుంటూ వస్తున్నాడు. ఈ దీర్ఘ కాలంలో అతను దసరాకుతప్ప పాఠశాల ఎప్పుడూ మూయలేదు. అందుకనే, ఇవ్వాళ పాఠశాలకు తాళంపడటం చూసి గ్రామస్థులు ఆశ్చర్యపోయారు.

సాయంత్రం పొరుగువాళ్ళు ఒకళ్ళిద్దరు సంగతి ఏమిటో కనుక్కుపోదామనే కుతూహలంతో వచ్చారు. సర్కారు మహాశయుడు దప్పాకు ఎప్పటిదో పాత కాన్వాసు సంచి తీసి తనకున్న మూడు ధోవతులూ, రెండు చొక్కాలూ అందులో సర్దుతూ ఉన్నాడు.

"ఇదేమిటి సర్కారుగారు ?" అని అడిగారు పొరుగువాళ్లు.

"పోతున్నాను, బాబూ ! ఇక ఈ ఊళ్ళో ఉండలేను. కొన్నాళ్ళపాటు తిరిగివస్తాను. మధుసూదనుకు చెప్పి పోతున్నాను ; అతను బడి చెప్పుకుంటూ ఉంటాడు. ఇల్లూ వాకిలీ అదే పడి ఉంటుంది. అయినా ఈ ఝంఝాటం నాకింకా ఎందుకు ?" అని, సంచి ఎత్తి బరువు చూసుకుని దించి—"నతన్ కు ఉచితవేతనం ఇచ్చారు నాయనా !" అని, నిట్టూర్చి కాయితం ఒకటి పక్కనున్నతనికి ఇచ్చాడు.

ఆ వ్యక్తి ఒకమాటు దాన్ని చూసి "ఇంకా అట్టిపెట్టుకున్నారెందుకు ? చూసుకుని దిగులుపడుతూ ఉండటానికా ?" అన్నాడు.

"ఏదో పడిఉంటుందిలే" అని, వృద్ధుడు అతని చేతిలో నుంచి ఆ కాయితం తీసుకుని "ఈ ముసలివాణ్ణి మరచిపోకండి బాబూ ! మళ్ళీ రావటం సంభవిస్తే కలుసుకుంటాను" అని రామనామం జపిస్తూ సంచి భుజాన తగిలించుకుని "ఇంకొక్క మాట. నేను మధుకు చెప్పేపోతున్నాను. మీరు కూడా కొంచెం జ్ఞాపకం చేయండి — పిల్లల్ని కొట్టకూడదని. ఎవరి జాతకం ఎలా ఉన్నదో ఎవరికి తెలుసు ? మూన్నాళ్ళ బతుక్కి——" అంటూ శంభు సర్కారు వెళ్ళిపోయాడు.

"పుత్రశోకంతో దశరథమహారాజు వంటివాడు చనిపోయాడు ; శంభు

సర్కారు బిసాతెంత !...పాపం రతన్ కూడా చాలా మంచి కుర్రవాడు" అన్నాడు ఒక పొరుగాయన.

శంభుసర్కారు భార్య రతన్ను కన్న మర్నాడే చనిపోయింది. శంభు మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. కుర్రవాడికి తల్లీ, తండ్రీ తానుగానే ఉన్నాడు. రతన్ పెద్దవాడయినాడు. ఉచిత వేతనంకోసం ప్రైమరీ పరీక్షకుకూడా కూర్చున్నాడు. కాని ఫలితాలు రాకముందే ఒకరోజు జ్వరంకాచి హఠాత్తుగా చనిపోయాడు. శంభుసర్కారు మహాధైర్యంతో ఈదెబ్బను తట్టుకున్నాడు — మామూలుగా బడిని సాగిస్తూ వచ్చాడు. కాని ఫలితాలు వెలువడి, రతన్ ఉచితవేతనం సంపాదించాడని తెలియగానే, అతనికి పుత్రశోకం మళ్ళీ కొత్తగా తలయెత్తింది. ఇంట్లో కూర్చుంటే అతనికి పాములు పాకినట్టుగా ఉంది. బళ్లో రతన్ కూర్చునే కాళీచోటువంక చూడగానే అతని గుండె ఆగిపోయినట్టయేది. అందుచేతనే శంభుసర్కారు ఈ ముసలితనంలో ప్రప్రథమం గ్రామం వదిలి బయలుదేరాడు.

* * *

ఆరుమాసాలు సంభుసర్కారు తీర్థాలు తిరిగాడు. చేతిలో ఉన్న డబ్బుకూడా అయిపోయింది. ఎక్కడయినా ఉద్యోగం చేయాలనుకున్నాడు. కాని ముసలివాడు, బొత్తిగా ఓపిక లేనివాడని ఎవ్వరూ ఇష్టపడలేదు. ఇక గత్యంతరం లేక కాలినడకను స్వగ్రామం బయలు దేరాడు.

ఆవాళ కాంతపురం చేరేవరకు పొద్దుకూకింది. రాత్రి జమిందారుగారి సత్రంలో ఉండి, ఉదయం లేచి జపం చేసుకుంటూ ఉండగా ఒక కుర్రవాడు వచ్చి అతనివంక కుతూహలంగా చూసిచూసి "నువ్వెవరివి ?" అని హఠాత్తుగా అడిగాడు.

కుర్రవాడు ముద్దువస్తూ ఉన్నాడు. శంభుసర్కారు జపం వదిలిపెట్టి "ముందు నువ్వెవ్వరో చెప్పు" అన్నాడు.

"నేనా ! రతన్ని" అన్నాడు కుర్రవాడు.

రతన్ ! శంభు గుండెల్లో కళుక్కు మన్నది. కొంచెంసేపు ఉండి "ఎవరి అబ్బాయివి ?" అని అడిగాడు.

"నాన్నగారి అబ్బాయిని" అన్నాడు కుర్రవాడు.

శంభుసర్కారు రతన్ను దగ్గరకు లాక్కొని "నేనూ నాన్నగారి అబ్బాయినే. నా పేరు శంభుసర్కారు!" అన్నాడు.

"నువ్వేనా శంభు? నాన్న నిన్ను పిలుస్తున్నారు! రా" అని శంభుసర్కారు చేయి పుచ్చుకుని లాగ నారంభించాడు.

పిల్లవాడు పొరపడ్డాడని శంభుకు తెలుసు. అయినా సరే, పోదాం పద!" అని జపంవదలిపెట్టి కుర్రవాడి వెంట బయలుదేరాడు.

జమీందారు తఖ్తాబల్లమీద కూర్చుని హుక్కా పీలుస్తున్నాడు. రతన్ శంభుసర్కారును వెంటబెట్టుకుని తండ్రి దగ్గిరికి వచ్చి "నువ్వు పిలిచావు కాదూ, తీసుకువచ్చాను" అన్నాడు.

"ఎవరిని తీసుకువచ్చావురా?" అన్నాడు జమీందారు నవ్వుతూ.

"శంభుసర్కారును కాదూ పిలిచింది?" అన్నాడు రతన్.

"తన పేరు కూడా శంభుసర్కారే ననుకుంటాను. అందుచేతనే కుర్రవాడు మిమ్మల్ని లాక్కొచ్చి ఉంటాడు. నేను మా మానేజరు శంభుసర్కారుకోసం వెతుకుతున్నాను......మీరు కూర్చోండి" అన్నాడు జమీందారు.

శంభు కూర్చున్నాడు. తర్వాత మాటలసందర్భంలో శంభు తన చరిత్ర అంతా చెప్పి — "ఎక్కడన్నా ఆశ్రయం దొరికితే ఈ చివరి నాలుగు రోజులూ ఏదోవిధంగా గడిపి పోవాలని ఉంది" అన్నాడు.

జమీందారుకు దయ కలిగింది — "మీ కిష్టమైతే ఇక్కడే ఉండవచ్చు — పిల్లవాణ్ణి కాస్త కనిపెట్టి చూస్తూ. భోజనమూ గుడ్డలూ కాక నెలకు పది రూపాయల జీతమిస్తాను. ఇష్టమేనా?" అని అడిగాడు.

శంభుకు కల్పతరువు లభించినట్టయింది. "చిత్తం! ఇంకా ఏంకావాలి! తమరు కరుణాసముద్రులు—" అన్నాడు.

* * *

ఉదయం ఒకగంటా, సాయంత్రం ఒకగంటా చదువుచెప్పే నియమం. కాని ఈ నియమాన్ని గురువుగానీ, విద్యార్థిగానీ పాలించేవారు కాదు. పగలు

పన్నెండు గంటల్లో ఆరుగంటలన్నా రతన్ శంభుసర్కారు ఇంట్లో గడిపే వాడు — చదువుకోసం కాదని వేరే చెప్పనక్కర్లేదు. శంభు తను చూసిన విచిత్రాలూ, పశుపక్షులనుగురించిన విశేషాలూ ఆ చిన్న విద్యార్థికి చెప్తూతో ఉండేవాడు. రతన్ ఆశ్చర్యంతో వినేవాడు. ఆగకుండానే సంగతిగూడా మరిచిపోయేవాడు. రతన్‌కు స్నేహితులు కూడా తగ్గిపోసాగారు. మాష్టరు గారిని వదలిపెట్టి పోయి ఆడుకోవడమంటే వాడికి కష్టంగా ఉండేది. అందుచేత శంభుసర్కారే రతన్‌కు స్నేహితుడుకూడా కావలసి వచ్చింది; వాడితో ఆడుకోవలసి వచ్చింది! ఆరవై సంవత్సరాలకూ ఆరుసంవత్స రాలకూ మధ్యఉన్న తేడా శంభుసర్కారు ఆచరణనుబట్టి తెలుసుకోవటం కష్టమైంది. అతను ఒకప్పుడు రతన్ను వీపుమీద ఎక్కించుకుని గుర్రం మాదిరిగా పరిగెత్తితే ఇంకొకప్పుడు పెట్టిబండిలో కూర్చోబెట్టి—ఇల్లు తన వంక కాతుకంగా చూస్తున్నారన్న సంగతిగూడా మరిచిపోయి — వాకిటి ముందర ఈడుస్తూ తిరిగేవాడు. ఇలా ఒక సంవత్సరం గడిచింది.

ఈ మధ్య శంభుసర్కారు స్వగ్రామంలో ఒకనికి ఉత్తరం రాశాడు— విశేషాలు తెలుపమని. దాని జవాబుగా—ఇంటిచుట్టూ జిల్లేళ్ళు మొలిచినవనీ, కప్పు పడిపోవటానికి సిద్ధంగా ఉన్నదనీ గ్రామస్థుడు రాశాడు. ఈ వార్త శంభును ఏమాత్రం చలింప జేయలేదు. మామూలుగానే అతను కుర్రవాడికి చదువు చెప్పటంలో నిమగ్నుడైనాడు.

రతన్ వేళకు ఇంటికి రాకపోవటమూ, ఎక్కువకాలం పంతులుగారి ఇంట్లో ఉండటమూ రతన్ తల్లికి బొత్తిగా ఇష్టంలేదు. ఈ సంగతి భర్త గారి దగ్గర తెచ్చి తన అయిష్టాన్ని వెల్లడించిందికూడా. భర్త సహజంగా ఉదాసీనుడు కావటంవల్ల ఈ సంగతి చెవినిపెట్టలేదు. ఇటు కుర్రవాడు పరాయివాడు అయిపోతున్నాడనే చింత తల్లిని ఎక్కువగా బాధించ మొదలు పెట్టింది. ఈ విషయమై ఏదో 'ఐసా పైసా' తేల్చుకోవాలని ఆమె ఆవాళగట్టిగా నిశ్చయించుకుని, భర్త భోంచేసి లేవగానే ప్రసంగం తెచ్చింది :

"కుర్రవాణ్ణి పంతులుకు వప్పజెప్పి మీరు నిశ్చింతగా ఊరుకున్నారు.

చదువు సంధ్యలు ఎలాఉన్నాయో ఏమన్నా కనుక్కున్నారా? నెల కాగానే జీతం పారవేయటమేనా!"

"పంతులు చాలా మంచివాడు, మనమేమీ దిగులుపడ నక్కర్లేదు" అన్నాడు భర్త.

పురుషులకు కంటపడని విషయాలు అనేకం స్త్రీలు కనిపెట్టగలరు—అనే విషయంమీద చిన్న ఉపన్యాసం ఇచ్చి—"అయినా ఒకమాటు పరీక్షించి చూడరాదూ, మీ అబ్బాయేగా!" అన్నది భార్య.

రతన్ను కబురంపి పిలిపించారు. పరీక్ష ఆరంభమైంది. రతన్ బాలశిక్ష గడగడా వప్పగించాడు.

"చూశావా!" అన్నాడు జమీందారు భార్యతో.

కొడుకు తెలివితేటలు తల్లికి ఆనందం కలిగించలేకపోలేదు. కాని సంతోషం వెలిబుచ్చటం తన ఉద్దేశానికి భంగమని అప్పటికి మెదలకుండా ఊరుకుంది.

సాయంత్రం ఈ ప్రసంగమే భార్య ఇంకోవిధంగా తెచ్చింది. ఒకనాడు పక్కయింటివారబ్బాయి—రతన్ ఈడువాడే—గడగడ ఇంగ్లీషు మాట్లాడుతుంటే రతన్కు ఏమీ అర్థంకాక నోరుతెరుచుకు చూస్తూ ఉండిపోయాడట. ఈ సంగతి భర్తకు చెప్పి "చూడండి, అబ్బాయికి ఇంగ్లీషు చెప్పించటం అవసరం. పెద్దవాడైనాక దొరలతో, కలెక్టర్లతో మాట్లాడాల్సివుంటుంది!" అని తన అభిప్రాయం వెల్లడించింది.

ఈ మాటలు భర్తకు విలువగలవిగానే కనిపించినవి. పరీక్షలసంగతి వదలిపెట్టినా—జమీందారుగారి అబ్బాయికి ఇంగ్లీషు తప్పక వచ్చివుండాలని అతని నమ్మకం.

"నాయనా, నువ్వు ఇంగ్లీషు నేర్చుకోనటంలేదా?" అని రతన్ను పిలిచి అడిగాడు.

"లేదు నాన్నా! పంతులుగారు చెప్పటం లేదు" అన్నాడు రతన్.

జమీందారుగారు ఏమీమాట్లాడలేదు. భార్య అందుకున్నది: "ఇంగ్లీషు చెప్పడం పంతులుగారి వల్లకాదు. ఎవరినైనా మంచివాణ్ణిచూసి పెట్టండి.

అబ్బాయిని అజ్ఞానిగా ఉంచటానికి నేను ఒప్పుకోను."

రతన్ తల్లి చెప్పినమాటలు మెదలకుండా విని, మనస్సులో ఇంగ్లీషు భావను శపిస్తూ వెళ్ళిపోయాడు.

మర్నాడు రతన్ రాత్రి జరిగిన సంభాషణ అంతా సవిస్తారంగా పంతులు గారికి చెప్పాడు. శంభు సర్కారుకు కళ్ళల్లో నీరు తిరిగింది. "అంతా మాయ! పరాయి అబ్బాయి!" అనుకున్నాడు మనస్సులో.

రతన్ ఏమీ మాట్లాడలేదు. కాసేపుండి శంభు ఇలా అడిగాడు:—"సరే, రతన్! నువ్వు సరిగ్గా విన్నావా, మీ అమ్మ కొత్త పంతుల్ని పిలిపించమనటం?"

"అc. పంతులుగారూ!... కాని నే నిక చదవను. మామామగారింటికి పోతాను" అన్నాడు రతన్ ముఖం అదోవిధంగా పెట్టి.

శంభు రతన్ను దగ్గరకు తీసుకుని తల నిమురుతూ—"చదవకపోతే విద్య ఎలా వస్తుంది, బాబూ!", అని మళ్ళీ ప్రశ్నించాడు—"మీఅమ్మ ఇంకా ఏమన్నది? నాదగ్గర మానెయ్యమన్నదా? ఇంకా నీతికథలూ, పంచతంత్రమూ చదవలేదని నువ్వెందుకు చెప్పలేదూ?"

"నేను మర్చిపోయాను, పంతులుగారూ!" అన్నాడు రతన్ నిస్సంకోచంగా.

"అట్లా చెప్పు. అందుకనే మీ అమ్మ ఇంగ్లీషు చదవమన్నది. సరే, నేను ఆమెకు నచ్చజెప్పుతానులే!"

నచ్చజెప్పితే జమీందారుగారి భార్య వింటుందనే నమ్మకం శంభుకు కొంత స్వస్థత కలిగించింది. తర్వాత వాచకం తీసి, జంతువుల పాఠం చెప్పబోతూ ఉండగా జమీందారుగారు వచ్చి-"పంతులుగారూ?" అని పిలిచాడు. ఆ పిలుపుకు శంభు కంపించిపోయాడు.

జమీందారుగారు కూర్చుని ఒకటి రెండు మామూలు విషయాలు మాట్లాడి ఇలా అన్నారు:

"కుర్రవాడు బాగానే చదువుకుంటున్నాడు. కాని, చూడండి, కొంచెం ఇంగ్లీషు నేర్చుకోవటం కూడా అవసరం. ఇప్పటినుంచే నేర్చుకోవటం

మొదలుపెడితే ముందు చాలా వీలుగా ఉంటుందేమో. ఏమంటారు?"

జమీందారుగారు కొంచెం డొంకతిరుగుడుగా చెప్పినా, తాత్పర్యం శంభు గ్రహించి తలగోక్కుంటూ గోక్కుంటూ,—"చిత్తం. రాజభాష నేర్చుకోకపోతే ఎలాగండి!" అన్నాడు.

"అయితే, ఆ ఊళ్ళో ఎవరన్నా స్కూలు మాష్టరు దొరుకుతాడేమో—" అని మళ్ళీ ఇలా ప్రశ్నించాడు—"మీకు ఇంగ్లీషు రాదుకదూ?"

ఒకప్పుడు శంభూ ఇంగ్లీషు అక్షరాలు నేర్చుకున్నాడు. అది ఇంగ్లీషు వచ్చిన కింద జమాకాదో వెంటనే తెలుసుకోలేక—"చిత్తం, నేను పూర్వ కాలపువాణ్ణి—"అని తప్పుకున్నాడు.

జమీందారుగారు మాట సాగనివ్వలేదు.—"అయితే తమరూ కొంచెం విచారించి చూడండి, నేనూ కనుక్కుంటాను'' అని జమీందారు వెళ్ళి పోగానే శంభు రతన్‌కు సెలవు ఇచ్చాడు.

రతన్ పుస్తకంమీదనుంచి ముఖం ఎత్తకుండానే ఇక పాఠం చెప్పరా పంతులుగారూ?" అన్నాడు అభిమానంతో. శంభూ రతన్ను దగ్గరకుతీసి కావిలించుకుని—"ఎందుకు చెప్పను, బాబూ! కాసేపు అట్లా తోటలోకి పోయి ఆడుకో, నేను పిలుస్తాను" అన్నాడు.

రతన్ తోటలోకిపోయి కొలనుదగ్గర కూర్చున్నాడు. కాని, ఎంతసేపు చూసినా పంతులుగారు పిలవకపోయేవరకు లేచి పంతులుగారిదగ్గరకు వచ్చి తొంగిచూశాడు. పంతులుగారు కళ్ళుమూసుకు పండుకుని ఉన్నారు. వారిని లేవగొట్టాలనే ఉద్దేశంతో రతన్ వాకిలిదగ్గరకూర్చుని, ఎక్కాలు వల్లించటం మొదలు పెట్టాడు.

శంభు నిద్రపోలేదు. రతన్ను దగ్గరకుపిలిచి—"నేను పక్కఊరు పోతు న్నాను, బాబూ! వచ్చేవరకు వేళ మిగలవచ్చు. ఈపూట భోంచేయనని ఇంట్లో చెప్పు" అని ఉత్తరీయం పైన వేసుకుని శంభుసర్కారు బయటికి వెళ్ళిపోయాడు.

శంభుసర్కారు పొరుగుగ్రామంనుంచి తిరిగి వచ్చేవరకు పొద్దుకూకుతూ ఉంది. జమీందారు బయట కూర్చుని వుండి—"మాష్టరుగారు దొరికారా,

పంతులుగారూ?" అని అడిగాడు. శంభు "దొరకలే"దని చెప్పి, చేతిలో పుస్తకాన్ని ఉత్తరీయం చాటున దాచుకుని గదికి వెళ్ళాడు.

శంభు అబద్ధం చెప్పాడని వేరే చెప్పనక్కర్లేదు. పక్క గ్రామంలోని మిడిల్ స్కూల్ మాష్టర్లు కళ్ళన్నీ ఈ కుర్రవాడిమీదనే ఉన్నవి. శంభూ రతన్ చదువును గురించి ఒకడితో మాట్లాడాడు కూడా. ఏసంగతీ సాయంత్రం చెప్పుతానని కనపడకుండా వచ్చాడు. రతన్ ఇంకొకళ్ళ దగ్గర చదవటం అంటే శంభుకు ప్రాణాలమీదికి వచ్చేది.

బాగా చీకటి పడింది. శంభు తాను కొనుక్కొచ్చిన ఫస్టురీడరు బయటికి తీసి ఇంగ్లీషు నేర్చుకోవ నారంభించాడు. తెల్లవారవచ్చినా అతని ఇంగ్లీషు జ్ఞానమేమీ వృద్ధి కాలేదు. అక్షరాలు గుర్తు పట్టటమే గగనమైంది. కునికిపాట్లతోనూ భాషాశక్తితోనూ యుద్ధంచేసి, చేసి, శంభు అలిసిపోయి తెల్లవారుతూ ఉండగా నిద్రకు పడ్డాడు.

తెల్లవారినాక రతన్ వచ్చాడు కాని పంతులుగారిని లేపలేదు. పది గంటలవేళప్పుడు, జమీందారుగారి గుమాస్తా పిలుపుకు శంభూ తుళ్ళిపడి లేచి—"ఓ, చాలా పొద్దు ఎక్కిందే!" అనుకున్నాడు.

"అయ్యా, బాబుగారు చాలా సేపటినుంచి మీకోసం చూస్తున్నారు" అన్నాడు గుమాస్తా.

"బాబుగారు పిలిచారా!" అని, శంభు రామనామం జపిస్తూ గుమాస్తా వెంట బయలుదేరాడు.

జమీందారుగారు కచేరీచావిట్లో కూర్చుని ఉన్నారు. వారి ఎదురుగ్గా కూర్చున్నది ఎవరు? శంభు ముఖం వెలవెల పోయింది.

"నిన్న వీరితోనే ననుకుంటాను, మీరు చెప్పి వచ్చింది" అన్నాడు శంభుతో జమీందారు.

శంభు వినోద మాష్టరుకేసి చూశాడు. ఆచూపులో ఉన్న మంటకు, ఇది కృతయుగమైనట్టయితే, వినోదుడు భస్మమైపోయేవాడు. జమీందారు ఇదేమీ గమనించలేదు.

"రతన్‌కు ఇవ్వాళే ఇంగ్లీషు రీడరు ఒకటి కొని పెట్టండి, ఏమంటారు?" అన్నాడు.

శంభూ "చిత్తం" అని తలతిప్పి తిన్నగా గదికి వెళ్ళిపోయాడు.

సాయంత్రం రతన్ కచేరి చావిడిలో కూర్చుని వినోద మాష్టరు దగ్గర ఇంగ్లీషు అక్షరాలు నేర్చుకోవడం శంభూ తన గదిలోనుంచి చూస్తూ ఉన్నాడు. రతన్ కూడా మధ్యమధ్య తల ఎత్తి పంతులుగారి గదివంక చూస్తూ ఉన్నాడు. శంభు కళ్ళల్లో నీరు తిరిగింది. చాలాసేపు నిశ్శబ్దంగా కూర్చుని తర్వాత ఏదో ఆలోచించి లేచి బయలుదేరాడు.

జమీందారుగారు తోటలో పచారు చేస్తూ ఉండగా శంభు వచ్చి నమస్కరించి—"ఇక నాకు సెలవిప్పించండి, బాబూ!" అని ఇంకా ఏమో చెప్పబోయాడు. కాని అతని స్వరం కంపించింది—మాట స్పష్టంగా వెలువడలేదు.

"వెళ్ళదలుచుకున్నారా? ఎక్కడికి పోతారు?"

"ముక్కుకు సూటిగా. ఈ నాలుగు రోజులూ ఎక్కడుంటే గడిచిపోదూ!"

"అయితే పొద్దు కూకిన తర్వాత కనపడండి" అని శంభును జమీందారు పంపించాడు.

రాత్రి తొమ్మిది గంటలకు శంభుకు పిలుపు వచ్చింది. శంభు వచ్చి నిలబడ్డాడు. జమీందారు లాంఛనంగా అనే ముక్కలు రెండూ, "మిమ్మల్ని వదలిపెట్టటం నా కెంతమాత్రం ఇష్టం లేదు; చాలా కష్టంగా ఉంది"—అనేవి చెప్పి, పదిరూపాయల కాయితాలు పది తీసి శంభు చేతిలో పెట్టి—"మీ జీతం!" అన్నాడు. నోట్లు తీసుకుంటూ ఉంటే శంభూ చేయి కంపించింది. ఎలాగో వాటిని ముడిచి చొక్కా జేబులో పెట్టుకుని—"తెల్లవారుఝామునే పోతున్నాను. ఒకమాటు రతన్ను చూడాలని ఉంది." అన్నాడు.

"వాడు నిద్రపోయాడనుకుంటాను" అన్నాడు జమీందారు.

"నిద్రపోయాడా? అయితే లేపవద్దులెండి, పాపం పగలంతా విశ్రాంతి ఎరగడు" అని శంభూ గదికి వచ్చాడు.

తెల్లవారుఝామున, శంభుసర్కారు మళ్ళీ పూర్వంమాదిరిగానే సంచి భుజాన తగిలించుకుని గదినుంచి బయలుదేరాడు. కొంత దూరం వచ్చి రతన్ పండుకునే గదివంక చూచి, శంభు—"మాయ! అంతా మాయ! పరాయి అబ్బాయి!" అని అనుకున్నాడు మనస్సులో. తర్వాత చకచక నడువ నారంభించాడు, గమ్యస్థానం నిర్ణయించుకోకుండానే, అనంతపథంలో.

మాసం గడిచింది. ఒకనాడు జమీందారు రతన్ ఇంగ్లీషు జ్ఞానం పరీక్షిస్తూ ఉండగా పోష్టుబంట్రోతు రతన్‌కు చిన్న పార్సిలు తెచ్చి ఇచ్చాడు. జమీందారు కుతూహలంతో పార్సిలు విప్పి చూశాడు. దానిలో వంద రూపాయలు ఖరీదుచేసే బంగారు గడియారమూ, చీటీముక్కా ఉన్నవి. చీటీలో రతన్ కోసం అని రాసిఉంది. కింద శంభుసర్కార్ సంతకం—కాని చిరునామా లేదు.

నిశ్శబ్దంగా, జమీందారు చాలాసేపు గడియారంవంక చూచి, తర్వాత దాన్ని రతన్‌కు ఇచ్చాడు. వెనక తను చూసిన దృశ్యం ఒకటి కళ్ళకు కట్టినట్టు అతనికి జ్ఞాపకం వచ్చింది—వృద్ధశంభూ రతన్ను వీపుమీద ఎక్కించుకుని, గుర్రంమాదిరిగా పరుగెత్తుతున్నాడు! రతన్ 'చల్ చల్' అంటూ పిలక పుచ్చుకు లాగుతున్నాడు!

---

# యువ ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. పాపం!!! | (కథలు) | 'చలం' | 0-12-0 |
| 2. హంపీ కన్యలు | (నవల) | .. | 0-12-0 |
| 3. అరుణ | .. | .. | 0-12-0 |
| 4. బ్రాహ్మణీకం | .. | .. | 0-12-0 |
| 5. అనావీలరు | .. | సౌరిస్ | 0-12-0 |
| 6. మారుపెళ్లి | .. | కుటుంబరావు | 0-12-0 |
| 7. కులంలేని మనిషి | .. | .. | 0-12-0 |
| 8. వరప్రసాదం | (కథలు) | .. | 0-12-0 |
| 9. బడదీదీ | (నవల) | శరత్‌బాబు | 0-12-0 |
| 10 పతివ్రత | .. | .. | 0-12-0 |
| 11. పల్లీయులు | .. | .. | 1-8-0 |
| 12. దేవదాసు | .. | .. | 1-8-0 |
| 13. తోకచుక్క | (కథలు) | 'చక్రపాణి' | 0-12-0 |
| 14. పాతమంగలి | .. | .. | 0-12-0 |
| 15. వనఫూల్ రచనలు | .. | .. | 0-12-0 |
| 16. ప్రగల్భప్రేతము | .. | .. | 0-12-0 |
| 17. పరాజయం | | మైత్ర | 0-12-0 |
| 18. నారీద్వేషి | | .. | 0-12-0 |
| 19. మూగజీవాలు | .. | గోఖలే | 0-12-0 |
| 20. ఎవరికి వారేనా | .. | కప్పగంతుల | 0-12-0 |
| 21. తెల్లవారుఝాము పాటాలు | | ,, | 0-12-0 |
| 22. క. స. కబుర్లు | .. | .. | 0-12-0 |
| 23. రూం టు లెట్ | .. | బాలక్రిష్ణశాస్త్రి | 0-12-0 |
| 24 మంగమ్మ | (నాటకం) | 'చలం' | 1-0-0 |
| 25. పలితకేశము | (కావ్యం) | దువ్వూరి | 1-0-0 |
| 26. కడలి పొంగులు | .. | సముద్రులు | 1-0-0 |

# క్రొత్త ప్రచురణలు

## కులంలేని మనిషి

కొడవటిగంటివారి నవల

## ప్రగల్భప్రేతము

బెంగాలీ కథల సంపుటి

## మూగజీవాలు

మా. గోఖలేగారి కథలు

## కడలి పొంగులు

సముద్రుల కావ్యము

## అరుణ

చలంగారి నవల


యువ బుక్ డిపో

మద్రాసు & తెనాలి





YUVA ......
PUBLICATION

PARAJAYAM
by MAITRA